॥ శ్రీహరిః ॥

761 ▲

# ఒకటి సాధిస్తే అన్నీ సాధించినట్లే

एकै साधे सब सधै ( तेलुगु )



గీతా ప్రెస్ – గోరఖ్‌పూర్

॥ శ్రీహరిః ॥

# ఒకటి సాధిస్తే అన్నీ సాధించినట్లే

एकै साधे सब सधै ( తెలుగు )


హిందీమూలము

స్వామీ రామసుఖదాస్

ఆంధ్రానువాదము

శ్రీ బులుసు ఉదయభాస్కరం



ప్రచురణ

గీతా ప్రెస్ – గోరఖ్‌పూర్


30 3 2K2

Published by Gobind Bhavan-Karyalaya,
Gita Press, Gorakhpur



| | | |
|---|---|---|
| First Three Editions | 1996—2000 | 20,000 Copies |
| Fourth Edition | 2001 | 5,000 Copies |
| | Total | 25,000 Copies |



Price : Four Rupees





Books are also available at—

1. Gita Press, Gorakhpur Ki Pustak-Dukan,
   Dukan N0.41, 4-4-1, Dilshada Plaza,
   Sultan Bazar, Hyderabad—500096; ✆ (040) 4758311
2. Gita Press Book-Stall, Railway Station, Platform No.1,
   Secunderabad—500003

Printed at Gita Press, Gorakhpur—273005
✆ : (0551) 334721; Fax : 336997

visit us at:www.gitapress.org
e-mail:gitapres@ndf.vsnl.net.in

# నివేదన

శ్రద్ధేయ స్వామీజీ శ్రీరామసుఖదాస్‌జీ మహారాజ్ నోటివెంట వెలువడిన ఉపదేశాల సంగ్రహమే ఈ పుస్తకం. ఈ ఉపదేశాలు అప్పుడప్పుడు "కల్యాణ్" హిందీ మాసపత్రికలో ప్రచురింపబడినవే. 'సాధన'కు సంబంధించిన నిగూఢ రహస్యాలను ఎంతో మార్మికంగా, సరళంగా మరియు ఇంపైన విధంగా వెల్లడించారు. ఈ ఉపదేశాలలోని విషయాలన్ని భగవద్గీత తదితర శాస్త్రాల దీర్ఘకాల మంథనం పరిణామమని దీనిపై స్వామీజీ సాధనమయమైన మరియు తపోయుక్తమైన జీవితానుభవప్రభావం ఉందని వేరుగా చెప్పవలసిన పనిలేదు. ఈ పుస్తకం సాధకులకు మరియు సాధన మార్గంలో పయనించాలనుకునే వారికి కల్పతరువు లాంటిది. ఒక సాధకుడి జీవనంలో స్వాభావికంగా ఉత్పన్నమయే ప్రశ్నలన్నిటికీ ఈ ఉపదేశాలలో సముచిత సమాధానాలు ఈయబడినవి.

ఈ పుస్తకంలో ఈ క్రింద పేర్కొన్న విషయాలపై వరుసగా దృష్టి కేంద్రీకరించడమైనది. 1. దృఢమైన భావన - దాని ప్రయోజనము. 2. భక్తియొక్క సౌలభ్యము. 3. గీతలోని జ్ఞేయతత్త్వము. 4.. భగవత్ప్రాప్తియే జన్మసార్థక్య హేతువు. 5. అఖండ సాధన. 6. అందరకు శుభమెట్లు చేకూరుతుంది? 7. ఉపాసనంటే ఏమిటి? దాని స్వరూపమెట్టిది? 8. సర్వోన్నతపదప్రాప్తికి సాధనము. ఈ విషయాలనన్నిటిని తెలుసుకుని ఉండడం సాధకుడికి ఎంతో ఉపయోగకరము. దృఢమైన భావము లేనిదే ఏ విధమైన సాధనలోనూ లీనమయిపోయే స్థితి కలుగదు. సాధనకు సంబంధించి గీత తదితర గ్రంథాలలో నాలుగు ప్రధానమార్గాలు పేర్కొనబడియున్నాయి. జ్ఞాన యోగము లేదా సాంఖ్య యోగము, భక్తి యోగము, కర్మ యోగము మరియు ధ్యాన యోగము. ఈ మార్గములన్నిటిలోను సుగమమైనది భక్తి యోగము. జ్ఞానమార్గములో నడిచేవారు ఏ వస్తువుయొక్క జ్ఞానాన్ని పొందాలనుకుంటున్నారో ఆ వస్తువు స్వరూపమేమిటి అని తెలుసుకుని ఉండడం అత్యంత అవసరము. పైన పేర్కొన్న నాలుగు సాధన మార్గాల లక్ష్యము భగవానుని చేరుకోవడమే.

లేని పక్షంలో దీనికి యోగము అనే పదము వర్తించదు. భగవత్ప్రాప్తి కోసమే ఈ మానవశరీరం మనకు లభించింది. అట్లుకాక జీవించడానికే అయితే పశు-పక్ష్యాదులు, క్రిమి-కీటకాలు కూడా జీవిస్తాయి. అఖండ సాధన జరుగక మధ్య మధ్యలో అంతరాయాలు వాటిల్లుతున్నా సాధన సఫలీకృతము కావాలని ఆశించడము దురాశే కాగలదు. సాధనలు అన్ని ఉపయోగకరమైనవి అయినప్పుడు అందరికీ కల్యాణమయమైన ఉపాయమేమిటి అన్న ప్రశ్న సాధకుడి మనస్సులో ఉత్పన్నమగుట సహజము. 'ఉపాసన' మార్గములో నడిచేవారు 'ఉపాసన' అంటే ఏమిటి, దానిస్వరూపము ఎట్టిది అని తెలిసికొని ఉండుట మిక్కిలి ఆవశ్యకము. ఈ విధముగా ఈ చిన్న పుస్తకము సాధకులకు ఎంతో ఉపయోగపడగలదు. శుభములను కోరువారు ఈ పుస్తకముద్వారా సముచితమైన లాభముపొంది జీవితాన్ని సార్థకము చేసుకోగలరని ఆశిస్తున్నాము.

ప్రకాశకులు.

----xXx----

## విషయ సూచిక



----xXx----

# 1. దృఢమైన భావన దాని ప్రయోజనము

"మనం వెళ్ళదలచుకోనట్టి ఊరికి దారి తెలుసుకోవడం ఎందుకు?" అన్నది ఒకసామెత. జీవితంలో మనం ఎన్నడు ఒక పని యేదైన చేయకూడదని దృఢనిశ్చయం చేసుకున్నామనుకోండి, ఇక దానిని చేసే పద్ధతితోను మనకు పనిలేదు. చేయుటతోనూ పనిలేదుకదా! ఉదాహరణకు ఎన్నడూ సినిమా చూడకూడదు అని మనం గట్టి నిర్ణయం చేసుకున్నామనుకోండి, చూడకపోవడమే. బీడి, చుట్ట, సిగరెట్టు ముట్టకూడదు అని అనుకున్నామనుకోండి, ముట్టకపోవడమే. నేటినుండి టీ త్రాగకూడదు అని అనుకున్నామనుకోండి, త్రాగకపోవడమే. అసత్యం ఆడకూడదు అని దృఢనిశ్చయం చేసుకున్న తరువాత ఇక మనం అసత్యం ఎందుకు ఆడతాము? ఆడనే ఆడము గదా! ఆ విధంగానే ప్రతి సద్గుణాన్ని, సదాచారాన్ని అవలంబించే విషయంలోను, దుర్గుణ, దురాచారాలను విడిచిపెట్టే విషయంలోను మనం ఒక దృఢనిశ్చయం చేసుకుంటూ ఉంటే అనాయాసంగా అవలంబించదలచుకున్న వానిని అవలంబించనూ గలం. విడిచిపెట్టదలచుకున్న వానిని విడిచిపెట్టనూ గలం అనేది తథ్యం.

అందుకు మనకు కావలసింది మనం ఏ ప్రతిజ్ఞ చేసినా దానిని దృఢంగా పాలించడం ఒక్కటే. అనగా మనం నిశ్చయబుద్ధితో ఏది యెట్లు చేయాలని అనుకుంటామో దానిని అట్లు చేయుచుండుటయే. అట్లు చేసుకుంటూ పోగా మన భావాలకు పరిపక్వస్థితి ప్రాప్తిస్తుంది. మనసంకల్పాలకు బలము చేకూరుతుంది. అలాగే మనం నోటితో ఏది అంటామో అది చేస్తుండాలి. ఏది మనం నొక్కి వక్కాణిస్తామో దానిని ప్రాణాలు ఒడ్డియైనా ఆచరణలో పెట్టుటకు ప్రయత్నం చేస్తుండాలి. ప్రాణాలుపోయినా సరే! అన్నప్రకారంగానే చేస్తాము. ప్రతి చిన్నపని విషయంలో కూడ ఇలాంటి దృఢప్రతిజ్ఞాలక్షణాన్ని, స్వభావాన్ని అలవరచుకునేందుకు ప్రయత్నం చేస్తూపోతే క్రమంగా మన స్వభావం చక్కబడుతుంది. అలా స్వభావం చక్కబడిపోయిన మీదట మనం అనుకొన్న విషయాలు ఎంత పెద్దవైనా, ఎంత క్లిష్టమైనవైనా అనాయాసంగా అభ్యాసస్థాయికి, ఆచరణస్థాయికి చేరతాయి. ఈ సద్భావనిర్మాణము,

ఆచరణకృషి బహు సుగమమైనది. శ్రేష్ఠమైనది.

సైన్యంలో జనులు భర్తీ అవుతుంటారు. లిస్టులో తమ పేర్లు వ్రాయించుకుంటూ ఉంటారు. అప్పుడు వారు తాము సైనికులం అయిపోయామని అనుకుంటారు. అలా అనుకున్న తరువాత వారికి సైనికుడు అయినవాడు ఏమి చేయాలి? అనే జిజ్ఞాస కలుగుతుంది. ఆ జిజ్ఞాస కలిగిన మీదట వారికి శిక్షణ ఇవ్వడం జరుగుతుంది. ఆ శిక్షణలోని విషయాలు క్రమంగా వారికి అలవాటు అవుతాయి. అలాగే ఒకడు సాధువు అయినాడు అనుకోండి. నేను సాధువును అయిపోయానుకదా, ఇప్పుడు నా కర్తవ్యమేమిటి? అనే జిజ్ఞాస వానిలో బయలుదేరుతుంది. అనంతరం వానికి సాధువు ఇలా ఉండాలి, ఇలా మాటలాడాలి, ఇలా చరించాలి, ఇలా వ్యవహరించాలి అని తెలియజేయడం, నేర్పడం జరుగుతుంది. అప్పుడు వాడు సాధులక్షణాన్ని అలవరుచుకుంటాడు. తాను సాధువువలె నడచుకోవాలని భావించుకుంటాడు. ఆ విధంగానే నాయనలారా! మీరు కూడ మిమ్ము సాధకునిగా భావించుకోండి. భగవంతుడి భజన, ధ్యానము చేసుకొనే సాధకునిగా తలచుకోండి. ఆధ్యాత్మిక గ్రంథాలలోను ప్రవచనాలలోను ఇలాంటి మాటలు కానవస్తు, వినవస్తు ఉంటాయి. సాధకుడైనవాడు చపలచిత్తుడు కాకూడదు. సమయాన్ని నిరర్థకంగా పోనీయకూడదు. అనుక్షణము భగవద్భజన, ధ్యానాదులను చేస్తుండాలి. దుర్జనసాంగత్యమును విడిచిపెట్టాలి. సత్సంగం, స్వాధ్యాయము మొదలైనవానిని అనుసరిస్తుండాలి మొదలైన మాటలు ఇంకా అనేకం ఉంటాయి. వాటిని సాధకుల కర్తవ్యాలుగ భావించుకోవాలి. సాధకులు వాటిని అనుసరిస్తూ ఉండాలి. ఆ లక్షణాలను తమలో అవతరింపజేసుకొనుటకు ప్రయత్నిస్తుండాలి. ఎవడు తననుతాను నిజమైన సాధకునిగా భావించుకుంటాడో వాడు ఇలాంటి లక్షణాలను అలవర్చుకోవడానికి ప్రయత్నం చేస్తాడు. క్రమంగా అవి వానిలో స్థిరపడిపోతాయి. కాని తనను తాను సాధకునిగా భావించుకొనని మానవుడు సత్సంగాలలో పాల్గొనడు, సత్ప్రవచనాలను ఆలకింపడు, సద్గ్రంథాలనూ పఠించడు. ఒకవేళ పాల్గొన్నా, విన్నా, పఠించినా అందలి విషయాలను తాను ఆచరించడానికిగాని, వాటితో ఎక్కువ సంబంధం ఏర్పరచుకోవడానికి కాని ప్రయత్నం చేయడు.

చాలమంది సోదరసోదరీమణులు నిత్యము జపము, పూజాపఠనాదులు చేస్తుంటారు. అట్లు చేయడం నిత్యనియమంగా చేసుకుంటారు. కాని వారు ఆ విషయంలో ఇలా భావిస్తుంటారు – ఆ! ఇదెంత పని? రోజూ గంటో, గంటన్నరో చేసుకొనే పని. మనం గృహస్థులం మనం ఫలానా యింటివారం, ఫలానా జాతివారం, ఫలానా వర్ణంవారం, ఫలానా ఆశ్రమంవారం. మనం చక్కపెట్టుకోవలసిన పనులు అనేకం ఉంటాయి. గంటో, గంటన్నరో భగవద్భజనం చేసుకుంటాం. గీతా పఠనం, కీర్తనము చేసుకుంటాం. సత్సంగం దొరికితే రోజూ పాల్గొంటాము. పన్నెండు నెలలు లభిస్తే పన్నెండు నెలలూ అనుసరిస్తాం. సత్సంగం పూర్తయితే హమ్మయ్య! ఇక్కడికి ఒక పని పూర్తయింది అనుకుంటాం. ఈ మాటలు, భావాలు వినడానికి బాగానే ఉన్నాయి. కాని వీనివలన మానవునియందు ఆశించినంత సంస్కరణ సిద్ధించదు. కారణమేమంటే ఈ సత్సంగాది విధులయందు వీరికి గ్రాహ్యదృష్టిలేదు. (ప్రత్యేక శ్రద్ధలేదు) ఏదో యాంత్రికంగా సాగే క్రియవలె అలవాటు చొప్పున ప్రతిపని చేసుకుంటూ పోవడమే కాని అందు మనోనియమం లేదు. ప్రాధాన్యదృష్టిలేదు. గ్రాహ్యదృష్టికి (ప్రత్యేకశ్రద్ధ, విశేషప్రాముఖ్యము, అందులకై వలయునంత తహతహ కలిగి ఉండే దృక్పథం) కుతూహలనివృత్తి దృష్టికి (ఏదో అలవాటు చొప్పున కాలం గడవడం కోసం కుతూహలం తీరడం కోసం శ్రద్ధారహితంగా అనుసరించే దృక్పథం) చాల తేడా ఉంది. సత్సంగాన్ని మన కుతూహలనివృత్తికో, మనోవినోదము కోసమో సాధనముగా చేసుకుంటున్నాము. అందుచేత అందలి విషయాలపట్ల దృఢసంకల్పం కలగడం లేదు. కాబట్టి మనం సత్సంగాదులయందు గ్రాహ్యదృష్టి (విషయాలను గ్రహించాలనే దృష్టి) కలిగి ఉండాలి. మనం ఎల్లప్పుడు భగవద్భజనధ్యానాదికాలు సాగించుకుంటూనే ఉండాలనే భావం కలిగుండాలి. ఏ పని చేసిన భగవత్సంబంధమైన పనినే చేస్తున్నామని భావించాలి. భగవానుని కోసమే చేయాలి. ఈ విధముగా భగవత్సంబంధమైనవిగా భావించి భగవానునికొరకే అన్ని పనులనూ చేసుకుంటు పోవడంవలన మనకు అత్యంత లాభం చేకూరుతుంది.

~~~~oOo~~~~
~~~~

## 2. భక్తియొక్క సౌలభ్యము

ఆలోచించి చూడగా నేటి మానవుడు అనూచానముగా సాగివచ్చు తనదైన శిక్షణ విధానాన్ని, సభ్యతను, సంస్కృతిని విడిచిపెట్టడం మూలంగానే వాని బ్రతుకు ఈనాడు భోగవిలాసాలకు ఆలవాలమై దుర్వ్యయపూరితం అయిపోయింది. జీవన నిర్వహణానికి అవసరమయ్యే వస్తువుల ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. ఉద్యోగాలవలన, వ్యాపారాలవలన వచ్చే ఆదాయం మానవుని అవసరాలు తీరడానికి సరిపోవడంలేదు. ఈ కారణంగా పారమార్థిక సాధనకు వానికి కొంచెం కూడ సమయం చిక్కడంలేదు. దానితోపాటు ఆలోచనలన్నీ భౌతికపరమైనవి కావడం కారణంగా వాని జీవితమంతా దుర్భరమై చింతలకు, కలతలకు నెలవు అయింది. ఇట్టి అవస్థలలో చిక్కి దిక్కుతోచక బాధపడుతూ ఉన్నవారికి సుఖశాంతులు గలిగించడానికే పరమదయాళువులైన మన మహర్షులు జ్ఞానయోగము, భక్తియోగము, కర్మయోగము, హఠయోగము, అష్టాంగయోగము, లయయోగము, మంత్రయోగము, రాజయోగము మొదలైన సాధనావిధానాలను ఎన్నిటినో మనకు తెలిపియున్నారు. ఆ విధానాలన్నీ వారివారి అర్హతలనుబట్టి మానవులకు భగవత్ప్రాప్తిని కలిగించి పరమశాంతిని ప్రసాదించేవే. కాని ఈనాడు కలికల్మష కలుషితజీవనులై, భోగవిలాసపరాయణులై, విషయలంపటులై, అల్పాయుష్కులై, అల్పబుద్ధులై, బలహీనులై చరించు మానవులకు పరమశాంతి, పరమానందము ప్రాప్తించాలంటే భక్తిమార్గం ఒక్కటే సులభమైన మహత్త్వపూర్ణమైన సాధనము. ప్రేమపూర్వకంగా నిరంతరం భగవానుని స్మరిస్తూ ఉండడమే ఆ భక్తియొక్క స్వరూపము. ఎట్లనగా? భాగవతములో కపిలమహర్షి తన తల్లికి భక్తిలక్షణాలను వివరిస్తూ ఏమన్నాడో చూడండి –

శ్లో. మద్గుణ శ్రుతిమాత్రేణ మయి సర్వగుహాశయే ।
మనోగతిరవిచ్ఛిన్నా యథా గంగాంభసోఽంబుధౌ ॥

లక్షణం భక్తియోగస్య నిర్గుణస్య హ్యుదాహృతమ్ ।
అహైతుక్యవ్యవహితా యా భక్తిః పురుషోత్తమే ॥

సాలోక్యసార్ష్టిసామీప్యసారూప్యైకత్వమప్యుత ।
దీయమానం న గృహ్ణంతి వినా మత్సేవనం జనాః ॥

స ఏవ భక్తియోగాఖ్య ఆత్యంతిక ఉదాహృతః ।
యేనాతివ్రజ్య త్రిగుణం మద్భావాయోపపద్యతే ॥
(3/29/11-14)

అనగా – గంగానదియొక్క అఖండప్రవాహం సముద్రం దిక్కునకు ఏవిధముగా సాగిపోతుందో, ఆ విధముగానే నా గుణాలను ఆలకించినంత మాత్రమున మనస్సు తైలధారవలె అవిచ్ఛిన్నంగా నావంకకు సాగిపోవుచుండుట, పురుషోత్తముడనైన నాయందు కామనారహితమైన అనన్యప్రేమ కలిగియుండుట అన్నదే నిర్గుణభక్తియోగలక్షణము. ఇట్టి నిష్కామభక్తిగల భక్తులు నిరంతరం నన్ను భజించుకొనుచు ఉండడాన్నే కోరుకుంటారు. ఇలాంటి నిష్కామభక్తులు సాలోక్యము, సార్ష్టి, సామీప్యము, సారూప్యము, సాయుజ్యము అనే మోక్షాలను ఇస్తామన్నా స్వీకరించుటకు కూడ ఇష్టపడరు. భగవత్సేవకోసం మోక్షాన్ని సైతం తృణీకరించి విడిచిపెట్టే ఈ భక్తియోగమే పురుషార్థము. ఇదియే సాధింపదగినది. ఈ యోగంద్వారా మానవుడు త్రిగుణాలను అధిగమించి నా భావాన్ని అనగా ప్రేమమయమైన నా అప్రాకృతస్వరూపాన్ని పొందగలుగుతాడు.

ఈ విషయాన్నే మధుసూదనాచార్యుడు తన "భక్తిరసాయనం"లో ఇలా వివరించాడు –

శ్లో. ద్రుతస్య భగవద్ధర్మాద్ధారావాహికతాం గతా ।
సర్వేశే మనసో వృత్తిర్భక్తిరిత్యభిధీయతే ॥

అనగా భాగవతధర్మాల సేవనంవలన ద్రవించి భగవానుడైన సర్వేశ్వరుని వంకకు (తైలధారవలె) అవిచ్ఛిన్నంగా సాగిపోయే చిత్తవృత్తినే భక్తియందురు.

పైన ఇచ్చిన వివరణాన్నిబట్టి తేలిన సారాంశమేమనగా అనన్యభావంతో కూడిన భగవత్స్మృతియే భగవద్భక్తి యన్నమాట.

మిక్కిలి గోపనీయమైనది, రహస్యయుక్తమైనది, భగవద్వచనామృత స్వరూపం అగునట్టిది భగవద్గీత అనే గ్రంథం. అందు ఎనిమిదవ అధ్యాయం ఆరంభంలో అర్జునుడు భగవానుని ఏడు ప్రశ్నలు అడుగుతాడు. అందు చివరిప్రశ్న– "స్వామీ! అవసానకాలంలో జీవులు మిమ్ము ఎలా పడయగలరు? అనేది. దానికి బదులు చెపుతూ భగవానుడు ఆ అధ్యాయములోనే ఐదవ శ్లోకంలో ఇలా అన్నాడు – అంత్యకాలంలో కూడ ఎవడు నన్నే స్మరిస్తూ దేహత్యాగం చేస్తాడో అతడు నిస్సందేహంగా నన్నే పొందుతాడు. కాబట్టి అర్జునా! నీవు సర్వకాలములందూ నన్నే స్మరించుము. యుద్ధము కూడా (కర్తవ్యకర్మ) చేయుము. ఈ విధంగా నాయందే మనస్సును, బుద్ధినీ లగ్నంచేసి ప్రవర్తిస్తుంటే నిస్సందేహంగా నీవు నన్నే పొందగలుగుతావు (8/7). ఇలాగే సగుణము, నిరాకారము అయిన పరమాత్మ స్వరూపాన్ని పొందే విషయంలో కూడ భగవానుడు ఏమన్నాడో చూడండి–

శ్లో. అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా ।
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్ ॥
(గీత. 8/8)

అర్జునా! పరమేశ్వర ధ్యానము యొక్క అభ్యాసరూపమగు యోగయుక్తుడై, మరొకవైపు పయనించని చిత్తముతో నిరంతరాయముగా చింతనముగావించు మానవుడు పరమ ప్రకాశరూపియగు దివ్యపురుషుని, అనగా పరమేశ్వరునే చేరుకొనునని భావము. ఇంతకుముందు శ్లోకంలో కూడ భగవానుడు ఏమన్నాడో చూడండి –

శ్లో. కవిం పురాణమనుశాసితార –
మణోరణీయాంస మనుస్మరేద్యః ।
సర్వస్య ధాతారమచింత్యరూప –
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥ (గీత. 8/9)

ఏ మానవుడు, సర్వజ్ఞుడు, అనాది, సర్వనియామకుడు, సూక్ష్మాతి

సూక్ష్మమగువాడు, సకలజీవుల పోషణము చేయువాడు, అచింత్య స్వరూపుడు, సూర్యునివలె తేజస్సుగలవాడు, అవిద్య కత్యంత దూరమైన, శుద్ధ సచ్చిదానంద ఘనుడగు పరమేశ్వరుని స్మరించునో అతడే పరమపురుషుడైన పరమాత్మను పొందగలడు.

ఈ అధ్యాయంలోనే పదునొకండవ శ్లోకంలో నిర్గుణ నిరాకార పరమాత్మస్వరూపం ప్రాప్తించే విషయంలో ఆ పరబ్రహ్మమును ప్రశంసించడం జరిగింది. పన్నెండవ శ్లోకంలో ఆ పరమాత్మను పొందే విధం చెప్పడం జరిగింది. తరువాత పదమూడవ శ్లోకంలో ఏమి చెప్పబడిందో చూడండి

శ్లో. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్ ॥
(గీత. 8/13)

అనగా ఏ పురుషుడు "ఓం" అనే ఈ ఏకాక్షర రూపమగు బ్రహ్మను ఉచ్చరించుచు, దానికి అర్థరూపుడను, నిర్గుణబ్రహ్మనగు నన్ను చింతించుచు దేహము వదలి వెళ్ళునో అట్టి పురుషుడు పరమగతిని చేరుకొనుచున్నాడని భావము.

ఇదే విధముగా గీతలో భగవానుడు సగుణ పరబ్రహ్మమును, నిర్గుణ పరబ్రహ్మమును పొందుటకు మార్గములను తెలిపియున్నాడు. కాని అందు యోగాభ్యాసము అపేక్షితమై ఉంటుంది. కాబట్టి సాధనాపరంగా అందు కష్టము ఉంది. అందుచేత తనను పొందడానికి సులభవిధము తెలుపుతు భగవానుడు అర్జునునితో

శ్లో. అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ నిత్య యుక్తస్య యోగినః ॥
(గీత. 8/14)

అని చెప్పియున్నాడు. అనగా ఓ అర్జునా! ఏ పురుషుడు అనన్యచిత్తుడై ఎల్లప్పుడు నిరంతరము పురుషోత్తముడనగు నన్ను స్మరించుచుండునో, నిత్యము నాలో నిమగ్నుడైనట్టి యోగికి నేను

సులభుడను, అనగా సహజముగనే లభ్యముకాగలనని భావం.

ఇక్కడ మనం గమనించవలసిన విషయమేమిటంటే 'సులభము' అనే మాట భగవద్గీతమొత్తంలో ఇక్కడే, ఈ ఒక్క శ్లోకంలోనే ప్రయోగించబడినది దీనిని బట్టి ఈ సౌలభ్యానికి అనన్యభావంతో నిత్యము నిరంతరము భగవత్స్మరణం చేయడమే కారణము లేక సాధనము అని వ్యక్తం అవుతుంది. అయితే ఇక్కడ మీరు ఒక ప్రశ్నవేయవచ్చు. ఏమనంటే భగవానుని స్వరూపమెట్టిదో తెలియకుండ ఆయనను స్మరించడం ఎలాగ? అని. దీనికి సమాధానం ఇది "భగవానుని స్వరూపం విషయంలో మీరు శాస్త్రాలలో ఏమి చదివారో, పెద్దల ప్రసంగాలలో ఏమి ఆలకించారో, ఏమి అర్థం చేసుకున్నారో దానిని అనుసరించియే (మీకు తెలిసినంతవరకే) భగవానుడు అనేవాడొకడు ఉన్నాడు అనే నిశ్చయబుద్ధి కలిగి ఉంటూ ఆ భగవానుని స్వరూపమందే అచంచలమైన శ్రద్ధకలిగి ఉంటు, ఆ స్వామినే శరణు పొందుతు మహామహిమాన్వితమైన, పరమపావనమైన ఆ స్వామియొక్క నామమును జపించుటలోను, ఆతని మంగళమయ దివ్యస్వరూపాన్ని చింతనం చేయడంలోను మీరు ఎంతో తత్పరత వహించి నిమగ్నులు కావాలి. ఆయన స్వరూపం విషయంలో మనకు కలిగిన పరిచయము లేక జ్ఞానములో లోపమేమైన ఉంటే దానిని కరుణామయుడు, పరమహితైషి అయిన ఆ భగవానుడే ఒకనాటికి తన సమ్యగ్ జ్ఞానాన్ని మనకు కలిగించి నివారిస్తాడు అని మనం పూర్తిగా విశ్వసించాలి. ఆ దేవుడు గీతలో కూడ చెప్పియున్నాడు. ఎట్లనగా

శ్లో. తేషామేవానుకంపార్థమహమజ్ఞానజం తమః ।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥
(గీత. 10/11)

అనగా ఓ అర్జునా! వారిమీద అనుగ్రహము చూపుటకై వారల అంతఃకరణములో నుండి నేను స్వయముగా వారల అజ్ఞానజనితమగు అంధకారమును ప్రకాశమయమైన తత్త్వజ్ఞానమనే దీపము ద్వారా తొలగించుచున్నాను అని భావం.

ఇలా ప్రేమపూర్వకముగా భగవద్భజనం చేస్తుంటే ఆ

పరమపురుషుడు మన యోగక్షేమాన్ని (అనగా అప్రాప్తమైన దానిని ప్రాప్తింపజేయుట, ప్రాప్తించినదానిని రక్షించుట) స్వయంగా వహిస్తాడు.

భగవానుని సేవించుటయే భగవద్భజనం. ఆ సేవనం కూడ ప్రేమపూర్వకంగా చేయబడినప్పుడే శ్రేష్ఠమైనది అవుతుంది. మనం ఆ స్వామితోడ ఘనిష్ఠమైన (ధృఢమైన) ఆత్మీయతా బంధం ఏర్పరచుకున్నప్పుడే ఆ స్వామిని సముచిత రీతిలో సేవించగలుగుతాం. లోకంలోని ఇతరవస్తువులతో సంబంధము, ఆత్మీయతలేనప్పుడే మనకు ఆ స్వామితోడ సుస్థిరమైన ఆత్మీయతాభావం కుదురుకుంటుంది.

నిజమాలోచించి చూడగా ఇక్కడ ఆ భగవానుడు ఒక్కడు తప్ప మనది అని ఎన్నుకొనదగినది ఏదీలేదు. ఆ స్వామి ఒక్కడే మనవాడు. మనం నిత్యము చూస్తున్న, వింటున్న, పరిచయం పొందుతున్న తక్కిన ప్రాకృతవస్తువులన్నీ మనలను నిరంతరం విడిచిపెట్టి పోతూనే ఉన్నాయి. అనగా నశించిపోతున్నాయి. ఇక అవి మనవి ఎట్లు అవుతాయి? అందుచేతనే కబీరు ఏమన్నాడో చూడండి

దిన దిన ఛాఁడ్యా జాత హై, తాసోఁ కిసా సనేహ ।
కహ కబీర డహక్యా బహుత గుణమయ గందీ దేహ ॥

అనుదినము నాశముచెందుచూ, త్రిగుణాత్మకము, మురికి కూపమైన ఈ దేహముపై నీకెందుకు మోహము.

కాబట్టి ఇతరం ఏదీ కూడ నాది నాది అని అనుకోవద్దు. కేవలము ఒక్క పరమాత్మనే నీవానిగా భావించి అతని పావననామాన్ని ప్రేమపూర్వకంగాను అనన్యభావంతోను స్మరించుకుంటు ఉండడమే అతనిని పొందుటకు మహత్త్వపూర్ణమైన సులభసాధనం.

ఈ అనన్య భావాన్ని పొందాలంటే మనం ఒక్క విషయం తెలుసుకోవాలి. అది ఏమంటే ఈ జీవాత్మ ఇటు పరమాత్మకు, అటు ప్రకృతికి మధ్యలో ఉంది. మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు, ప్రాణము, శరీరము దానికి సంబంధించిన ధనము, జనము మొదలైనవాటిపట్ల జీవాత్మ ఎంతవరకు అభిముఖంగా ఉంటుందో అంతవరకు దానికి అనన్యభావం సాధ్యంకాదు.

అనన్యభావంతో అది పరమాత్మను భజించలేదు. కాబట్టి నాది, నావాడు అనుకోవడానికి నాకు ఏదీలేదు. ఎవ్వరూలేరు. నేను సేవించడానికి లోకమంతా ఉన్నా వస్తుతః నేను ఒక్క పరమాత్మకు తప్ప మరి ఎవ్వరికిని సంబంధించినవాడను కాను అనే దృఢనిశ్చయం మానవునిలో కలగాలి. ఆ నిశ్చయమే వానికి అనన్యభావాన్ని కలిగించగలుగుతుంది. ఈ విధంగా "చేతసా నాన్యగామినా" (8/8) "అనన్యేనైవ యోగేన" (12/6) "మాం చ యోऽవ్యభిచారేణ" (14/26) "అనన్యాశ్చింతయంతో మాం" (9/22) "మచ్చిత్తాః" (10/9) "మన్మనా భవ" (9/34) (18/65) "మచ్చిత్తః సతతం భవ" (18/57) "మచ్చిత్తః సర్వదుర్గాణి" (18/58) "మయ్యేవ మన ఆధత్స్వ" (12/8) "మయ్యర్పితమనోబుద్ధిః" (8/7) మొదలైన మహత్త్వపూర్ణములైన యీ వాక్యాలన్నీ అనన్యభావముతో భగవానుని చింతనము, భజనము చేయుటలో విశేషమహత్త్వం ఉందనీ, అందువలన పరమాత్మప్రాప్తిరూపముగా మహాఫలం కలుగుతుందని ఘోషిస్తున్నాయి. ఎవని ధారణలో ఒక్క భగవానునియందు తప్ప మరియెందును మహత్త్వభావనలేదో వాడే అనన్యభావం కలవాడు, అనన్యభావంతో భగవత్స్మరణం చేసేవాడు అన్నమాట. ఇకపోతే "సతతం" అనే శబ్దం ఒకటి ఉంది. అది చింతనమనేది నిరంతరంగా సాగాలని చెబుతుంది. ఆ నిరంతరచింతనమనేది భగవానునితోడ నిత్యంగానూ, అఖండంగాను సాగివచ్చే సంబంధంయొక్క పరిజ్ఞానం కలిగినప్పుడే సాధ్యం కాగలుగుతుంది.

ఇక్కడ క్రింద ఇచ్చిన కబీరు సూక్తిని మనం గమనించాలి.

నా నడకయే నీ ప్రదక్షిణము
నా కర్మలే నీకు పూజ
నా శయనమే నీ దండప్రణామము
దేవా! నీవుతప్ప అన్యమునెరుగను

ఈ విధంగా అనుక్షణమూ తనతో అనుబంధంగల యోగికి ానుడు సహజంగానే సులభుడై ఉంటాడు. అయితే మన దురదృష్టము

ఏమిటంటే మనం భగవంతుడితో తప్ప ఇతర అశాశ్వతములైన, అస్థిరములైన వస్తువులతో అనుబంధాన్ని జోడించుకుంటున్నాము. లౌకిక పరమైన సంబంధాలు దూరమయితే భగవంతుడితో మనకు నిరంతరం, అభేద్యమైన సంబంధాలు సహజంగానే సిద్ధిస్తాయి. అందువల్ల మనం లౌకికపరమైన సంబంధాలను త్రెంచుకుని మన శ్రేయస్సును అమితంగా అభిలషించే భగవానుడితో నిత్యమైన, నిరంతరం సంబంధాలను ఏర్పరచుకోవాలి. అతడు సర్వప్రాణులపట్ల సహృదయం కలవాడే కాక అవ్యాజకరుణామయుడు. దయామయుడైన శ్రీహరి మనలను అంటిపెట్టుకునే ఉంటాడు. అతడు తనకు పరమమిత్రుడైన అర్జునుని స్వజనునిగా స్వీకరిస్తూ ఏమన్నాడో చూడండి

> శ్లో. సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
> అహం త్వా సర్వపాపేభ్యోమోక్షయిష్యామి మా శుచః ॥
> (గీత. 18/66)

సమస్త ధర్మముల అనగా సమస్త కర్తవ్యకర్మముల నా యందు త్యజించి, నీవు కేవలము నన్ను సర్వశక్తిమంతుని సర్వాధారియైన పరమేశ్వరుని శరణము నొందుము. నేను నిన్ను సర్వపాపములనుండి ముక్తుని గావింతును. నీవు శోకింపకుము.

స్వయముగా తయారు చేసుకున్నవస్తువు ఎలా ఉన్నా, ఎలాంటిదైన చేసుకున్నవానికి ప్రీతిపాత్రమే అవుతుంది. అలాగే యీ విశ్వమంతా భగవానుడు రచించుకొన్నట్టిది. అతనికి సొంతమైనది. అందుచేత దీనిమీద అతనికి సహజంగానే ప్రీతి ఉంటుంది. "ఈ విశ్వాన్నంతను నేను రచించుకున్నాను. కాబట్టి ఇందున్న వారందరియందు నాకు సమానమైన దయ ఉంది"అని ఒకచోట భగవానుడే చెప్పియున్నాడు.

అట్టియెడ ఎవడు అన్నివిషయాలనుండి చిత్తమును మరలించుకొని "నీవే తప్ప నితః పరంబెరుగ" అంటూ భగవానుని శరణు పొందుతాడో వానికై ఆ భగవానుడు తప్పక దయ చూపుతాడని వేరుగా చెప్పవలసిన పని ఏముంటుంది?

మదము, మాయ విడిచి మనసా, వాచా, కర్మణా నన్ను భజించు

వాడు పురుషుడుకాని, స్త్రీకాని, నపుంసకుడుకాని చరాచరజీవులలో ఏ జీవియైనకాని, నన్ను అనన్యభావంతో నిష్కపటంగా భజించేవాడు ఎవడైనకాని నాకు అత్యంతప్రీతిపాత్రుడు అని భగవానుడు చెప్పినట్లు తులసీరామాయణంలో చెప్పబడినది. అందులోనే వేరొకచోట సుతీక్షణుడు ఏ దిక్కూలేక తనను ఆశ్రయించినవారియందు కరుణానిధి అయిన భగవానునకు ప్రేమ ఎక్కువ అని అంటాడు.

కాబట్టి భగవానుడు తాను ఎవరిని ఇష్టులుగా స్వీకరిస్తాడో వారికి అతడు సులభుడు అనడములో అణుమాత్రమూ సందేహంలేదు. ఇదిగో! ఇక్కడ చూడండి! భగవానుడు తన ముఖతః అర్జునునితో ఇట్లనెను

శ్లో. యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః ।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే ॥

తేషామహం సముద్ధర్తా మృత్యుసంసార సాగరాత్ ।
భవామి నచిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్ ॥
(గీత. 12/6 7)

ఏ నా భక్తజనులు మత్పరాయణులై కర్మలనన్నింటినీ నా యందు సమర్పించి నన్ను సగుణ రూప పరమేశ్వరునిగా అనన్య భక్తి యోగముతో నిరంతర చింతనమున భజించుచుందురో; అర్జునా! అట్టి నాలో బుద్ధినుంచు ప్రేమాస్పదులైన భక్తులను నేను త్వరితముగా మృత్యురూప సంసార సముద్రమునుండి ఉద్ధరించుదును.

~~~~oOo~~~~
~~~~

# 3 గీతలోని జ్ఞేయతత్త్వము

భగవద్గీతను అనుసరించి చెప్పాలంటే "జ్ఞేయము" అనే శబ్ధానికి పర్రబహ్మ లేక పరమాత్మ అని అర్థము. బాగుగా విచారణ చేయగా ఏది తెలుసుకోవడానికి శక్యం అయినదో అది జ్ఞేయం అని లేదా ఏది తప్పక తెలుసుకోవలసినదో అది జ్ఞేయం అని అర్థం స్ఫురిస్తుంది వీటిలో మొదటి అర్థాన్ని బట్టి చూస్తే తెలుసుకోవడానికి శక్యమయ్యేది ప్రపంచం లేక జగత్తు కారణమేమంటే ఈ నశ్వరజగత్తే ఇంద్రియాల మూలంగానో లేక అంతఃకరణం ద్వారానో తెలుసుకొనబడుతుంది. దానిని తెలుసుకోవడానికి ఉపకరించే సాధనాలు కూడ ఆ జ్ఞేయజగత్తులో అంతర్గతంగా ఉన్నవే. ఆ జగత్తుయొక్క తత్త్వాన్ని తెలుసుకోవడం కూడ ఉపయుక్తమైనదే. దాన్ని తెలుసుకోవడం ఎందుకు? అంటే దానిని విడనాడుటకే. తాత్త్వికంగా దాని నిజస్వరూపం అర్థమయితేకాని మానవుడు దాన్ని విడిచిపెట్టడు. అనగా ఆ జగత్తు జ్ఞేయం (తెలుసుకోదగినది) అయి ఉండికూడ త్యాజ్యం (త్యజింపదగినది) అయినది అన్నమాట నిజం చెప్పాలంటే పరమాత్మ ఒక్కడే జ్ఞేయుడు (తెలుసుకోదగినవాడు) "వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః" (గీత.15/15) అనగా వేదములద్వారా నేనే తెలియదగిన వాడను అని. "వేద్యం పవిత్రం" (గీత 9/17) నేను పవిత్రుడను, తెలుసుకోదగినవాడను అని భగవానుడు గీతలో స్పష్టంగా చెప్పియున్నాడు.

పదమూడవ అధ్యాయములో భగవానుడు జ్ఞానానికి సంబంధించి ఇరువది సాధనములను తెలిపి దానిని జ్ఞానం అని పేర్కొనడం జరిగింది. సాధనములవలన దేనియొక్క జ్ఞానం కలుగుతుందో ఆ జ్ఞేయతత్త్వం పరమాత్మ అన్నమాట. ఈ విషయాన్ని స్పష్టీకరిస్తూ గీతలో

శ్లో॥ జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వామృతమశ్నుతే ।
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే ॥
(గీత. 13/12)

అనగా ఏది తెలియదగినదో, దేనిని తెలుసుకొనిన మనుజుడు పరమానందమును పొందునో, దానిని తెల్పుదును. అనాదియైన పర్రబహ్మమును సత్తని అసత్తని చెప్పబడదు.

ఈ శ్లోకంలో మొదటి పాదంలో జ్ఞేయతత్త్వాన్ని చెపుతున్నాను అని ప్రతిజ్ఞ చేయడం జరిగింది. రెండవ పాదంలో దానిని తెలుసుకోవడంవలన అమృతప్రాప్తి (అమరత్వసిద్ధి, జన్మరాహిత్యం) ఫలంగా చెప్పడం జరిగింది. మూడవపాదంలో దానిపేరు, లక్షణము వివరించబడింది. నాల్గవపాదంలో అది సత్తు కాదు. అసత్తు కాదు అని అంటూ ఆ జ్ఞేయతత్త్వం యొక్క అలౌకికత్వాన్ని వక్కాణించడం జరిగినది. ఈ విధముగా ఈ శ్లోకంద్వారా పరమాత్మయొక్క నిర్గుణ నిరాకారస్వరూపం వర్ణించబడింది. ముందు శ్లోకంలో పరమాత్మయొక్క సగుణ నిరాకార స్వరూపము వర్ణించబడింది. అది యెట్లు అనగా

శ్లో. సర్వతః పాణిపాదం తత్సర్వతోऽక్షిశిరోముఖమ్ ।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి ॥
(గీత. 13/13)

అది అంతటనూ పాణి పాదములు గలది, అంతటను అక్షి శిరోముఖములు గలది, సర్వత్ర శ్రోత్రములు గలది. ఎందువలననగా లోకమునందు సర్వత్ర వ్యాపించియున్నది. అది ఎలాగ? అంటారా. ఇదిగో! చూడండి! బంగారం ముద్ద లేక దిమ్మ ఉంది అనుకోండి, అందులో ఎన్నో నగలు దాగి ఉన్నాయి. రంగు ఉంది అనుకోండి, అందులో ఎన్నో చిత్తరువులు దాగి ఉన్నాయి. సిరా ఉంది అనుకోండి, అందులో ఎన్నో లిపులు (అక్షరాలు, వ్రాతలు) దాగి ఉన్నాయి. విద్యుత్తు ఉంది అనుకోండి, అది ఒక్కటే అయినా చేసే పనులు అనేకం. వేరువేరు యంత్రాలమూలంగా అదిచేసే పనులు వేరువేరు విధములు. భిన్నరూపాలు కలిగి ఉంటున్నాయి. ఒకే విద్యుత్తు నీటిని గడ్డకట్టిస్తుంది, పొయ్యిని మండిస్తుంది, లిఫ్టును పెద్దపెద్ద మేడలలో పైకి ఎక్కించి క్రిందకు దింపుతుంది, ట్రాంబండిని, రైలుబండిని నడుపుతుంది, శబ్దాన్ని ప్రసారం చేస్తుంది, పాటలను రికార్డులలోకి ఎక్కిస్తుంది. పంకాలను త్రిప్పుతుంది. వెలుతురును ఇస్తుంది. ఈ విధముగా దానివలన పరస్పరవిరుద్ధంగాను, చిత్రవిచిత్రంగాను ఎన్నో పనులు జరుగుతుండడం మనం చూస్తున్నాం. ఇలాగే ఒకే పరమాత్మవలన జగత్తుయొక్క సృష్టి, స్థితి, లయము, మొదలైన పరస్పర విరుద్ధకార్యాలెన్నో జరుగుతుంటాయి. ఈ తత్త్వం తెలియకపోవడం చేతనే

జనులు ఒక్కడే పరమాత్మ అయినప్పుడు లోకంలో ఒకడు సుఖవంతుడు, ఇంకొకడు దుఃఖవంతుడు ఎందుకు అవుతున్నాడు? అని అంటుంటారు. ఏ పరబ్రహ్మ నిర్గుణుడు, నిరాకారుడు, వాక్కుకు, మనస్సుకు, బుద్ధికి అందనివాడో అతడే సృష్టిస్థితిలయాలను సాగిస్తున్న సగుణనిరాకార పరమేశ్వరుడుకూడ అని వారు ఎరుగరు. వీని యేకత్వాన్ని ప్రతిపాదిస్తూ గీత ఏమన్నదో చూడండి

శ్లో. సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥
(గీత. 13/14)

అనగా సర్వేంద్రియముల గుణముల తెలిసి కొనునది అయ్యు వాస్తవమున తాను ఇంద్రియములు లేనిది, మరియు ఆసక్తి రహితమైయుండియు తాను సకలము భరించునదియై యున్నది. నిర్గుణమయ్యును గుణములననుభవించునది.

శ్లో. బహిరంతశ్చ భూతానామచరం చరమేవ చ ।
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్ ॥
(గీత. 13/15)

అది చరాచరములగు భూతములలో నంతర్బాహ్యముల నిండియున్నది. మరియు చరాచర ప్రపంచము తానే అయియున్నది. అది సూక్ష్మ మైనందున అవిజ్ఞేయమై యున్నది. అత్యంత సమీపముననూ అత్యంత దూరముననూ అదియే యున్నది. శ్రుతి కూడ "విజ్ఞాతార మరే కేన విజానీయత్?" అని అంటుంది.

అతని చిత్తశక్తివల్లనే మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు తమతమ విషయాలను తెలుసుకోగలుగుతాయి. ఆ జ్ఞేయతత్త్వము ఎంత దగ్గరగా ఉందో అంత దూరంగా ఉన్నట్లు. ఎంత దూరంగా ఉన్నట్లు తోస్తుందో అంత చేరువగా ఉన్నట్లు భాసిస్తుంటుంది. ఎలాగంటే దేశదృష్టితో చూస్తే భూమికి చేరువగా శరీరము, శరీరానికి చేరువగా ప్రాణములు, ప్రాణానికి చేరువగా ఇంద్రియాలు, ఇంద్రియాలకు చేరువగా మనస్సు, మనస్సునకు చేరువగా బుద్ధి, బుద్ధికి చేరువగా జీవాత్మ, ఆ జీవాత్మకు చేరువగా దాని ప్రేరకుడు, ప్రకాశకుడు, సర్వవ్యాపకుడు అయిన పరమాత్మ ఉన్నారు. ఇది సమీపదృక్పథం. ఇక దూరపు దృక్పథం ఎలాగంటే శరీరానికి దూరంగా

పృథ్వి, పృథ్వికి దూరంగా జలము, జలానికి దూరంగా తేజస్సు, తేజస్సునకు దూరంగా వాయువు, వాయువునకు దూరంగా ఆకాశము, ఆకాశానికి దూరంగా సమిష్టిమనస్సు, ఆ మనస్సుకి దూరంగా మహత్తత్త్వము, దానికి దూరంగా పరమాత్మయొక్క ప్రకృతి, ఆ ప్రకృతికి అతిదూరంలో పరమాత్మ ఉన్నారు. కాబట్టి దేశదృష్టితో చూస్తే పరమాత్మ దూరాతిదూరంగా ఉన్నాడు. అట్లే కాలదృష్టితో చూస్తే అత్యంతదూరంగాను, అత్యంత సమీపంగాను కూడ ఉన్నాడు. వర్తమానకాలంలో ఆ పరమాత్మ ఉన్నాడు. ఎందుచేత అంటే జడపదార్థం ప్రతిది అనుక్షణం నశించిపోతుంది. కాబట్టి అక్కడ అతని సత్తా (అస్తిత్వం) లేనేలేదు. ఒకవేళ ఉంది అని అనుకున్నా దానికంటెను చేరువగా సత్యతత్త్వం ఉంది. ఇక భూతకాలం వంకకు చూస్తే దినము, పక్షము, మాసము, ఋతువు, అయనము, సంవత్సరము, యుగము, చతుర్యుగాలు, కల్పము, పరార్థము, బ్రహ్మయొక్క ఆయువు, దానికంటెను ముందు "సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్".

సజాతీయ, విజాతీయ, స్వగతభేదాలు లేక సత్తురూపంలో వెలుగొందుచు ఒక్క పరబ్రహ్మ పరమాత్మయే ఉన్నాడు. ఇక భవిష్యత్కాలంలో కూడ అదేవిధంగా క్షణము, సెకను, నిమిషము, అర్థఘటిక, ఘటిక, జాము, దినము, పక్షము, మాసము, ఋతువు, అయనము, సంవత్సరము, యుగము, చతుర్యుగము, కల్పము, పరార్థము, బ్రహ్మయొక్క ఆయువు దానికి ఆవలకూడ పరమాత్మయే ఉంటాడు. (శిష్యతే శేషసంజ్ఞః) కాబట్టి దూరాతిదూర దృక్పథంతో చూచినా ఆ తత్త్వమే మిగులుతు ఉంటుంది.

దేశ, కాల, వస్తువులకు ఏ జ్ఞానమునందు అంతర్గతాలుగా ప్రతీతి కలుగుతూ ఉంటుందో అది చిత్స్వరూపజ్ఞానమే. దానిలో అంతర్గతములై వచ్చు దేశ, కాల, వస్తువులు క్షణము కూడ నిలుకడలేక కేవలము నిరంతరపరివర్తనం చెందేవిగా ప్రతీతిని కలిగిస్తుంటాయి. ఈ పరివర్తనక్రమంలో వస్తువు కానరాదు. క్రియయే సాగిపోతుంటుంది. ఆ క్రియ కూడ సాగిపోతున్నట్లు అనిపిస్తుంది. కాని అదియు నిలువక కేవలం జ్ఞానం మాత్రమే ఉంటుంది. ఆ జ్ఞానము చిన్మాత్రము. ఎలా ఉన్నది అలా మార్పులేకుండా ఉంటుంది. అదే తప్పక తెలుసుకోదగిన వస్తువు

"యజ్ఞాత్వా నేహ భూయోఽన్య జ్ఞాతస్య మవశిష్యతే"

అది (దానిని) తెలుసుకున్న తరువాత ఇక తెలుసుకోవలసినది ఏదీ ఉండదు. పొందవలసినది ఏదీ ఉండదు. చేయవలసినది కూడ ఏదీ ఉండదు. ఆ జ్ఞేయతత్త్వం

శ్లో. అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్ ।
భూతభర్తృ చ తద్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥
(గీత. 13/16)

అనగా ఆ పరమాత్మ విభాగరహితుడు, ఏకరూపమున ఆకాశమువలె పరిపూర్ణుడయ్యును చరాచర భూతకోటియందు విభజింపబడినట్లు గన్పించును. అదియే తెలియదగినదై భూతముల భరించు విష్ణువై, హరించు హరుడై పుట్టించు బ్రహ్మమై యున్నది.

"జ్యోతిషామపి తజ్జ్యోతిః" అది జ్యోతిస్సులకు కూడ జ్యోతిరూపం అగునట్టిది. ఎట్లనగా ఘటపటాదులైన భౌతిక పదార్థాలను ప్రకాశింపజేసేవాడు సూర్యుడు. ఆ సూర్యుడు ఘటపటాదుల భావమును ప్రకాశింపజేస్తాడు. అభావాన్ని ప్రకాశింపజేస్తాడు. ఆ సూర్యుని ప్రకాశస్థితిని, అప్రకాశస్థితిని నిర్వికారంగా నేత్రం ప్రకాశింపజేస్తుంది (గోచరింపజేస్తుంది). ఆ నేత్రంయొక్క దృష్టిని (దర్శనక్రియను) దాని సువ్యవస్థితదశను, అవ్యవస్థితదశను దానివెనుక ఏకరూపంగా ఉన్న మనస్సు ప్రకాశింపజేస్తుంది. ఆ మనస్సుయొక్క శుద్ధములు, అశుద్ధములు, వికారయుక్తములు అయిన క్రియలను దాని వెనుక ఉండి బుద్ధి నిర్వికారంగా ప్రకాశింపజేస్తుంటుంది. ఆ బుద్ధియొక్క సవ్యము, అపసవ్యము అయిన క్రియాస్వరూపాన్ని ఆత్మ ప్రకాశింపజేస్తుంది. అలాగే సమిష్టిసృష్టి నానావిదాలుగా ఉండే క్రియల, అక్రియల స్వరూపాన్ని శుద్ధచేతన స్వరూపుడైన పరమాత్మ ప్రకాశింపజేస్తుంటాడు. కాబట్టి అతడు జ్యోతిస్సులకు జ్యోతిస్సు అయ్యాడు. అతడు అజ్ఞానాంధకారానికి భిన్నముగా ఉంటాడు. అతడు కేవలము జ్ఞానస్వరూపుడు. తెలుసుకోదగినవాడు. అమానిత్వం, అదంభిత్వం ఆదిగ చెప్పబడిన యిరువది సాధనముల సహాయంతో ఎవరైన అతనిని పొందవచ్చును.

అతడు ఎల్లవేళల ఎల్లవారి హృదయాలలోను వెలుగొందుతున్నాడు. భగవానుడు గీతలో స్పష్టంగా "సర్వస్య చాహం హృది సన్నివిష్ట:" (15/15) అని "ఈశ్వర: సర్వభూతానాం హృద్దేశేऽర్జున తిష్ఠతి" (18/61) అని చెప్పియున్నాడు. అతడే సర్వవ్యాపకుడు. సర్వమునకూ అధిష్ఠానమయినవాడు. సర్వస్వరూపుడైన పరమాత్మ. అతడే సర్వవిధాల తెలుసుకోదగినవాడు. అతడే పరబ్రహ్మ, పరమాత్మ. అతనియందు జగత్తులేదు. జగదాకారంగా పరిణతమయ్యే ప్రకృతీలేదు. ఆ దశలో అతడు నిర్గుణుడు, నిరాకారుడు అనబడుతాడు. ప్రకృతితో కూడిన జగత్తుకి అతనిని మనం కారణభూతునిగా చూచినప్పుడు అతడు సగుణనిరాకారమూర్తిగా తెలియబడతాడు. అతనిని మనం సమస్త ప్రపంచానికి సృష్టికర్తగాను, పాలకునిగాను, సంహారకునిగాను చూచినప్పుడు అతడే మనకు బ్రహ్మగా, విష్ణువుగా, మహేశ్వరుడుగా తెలియవస్తాడు. ధర్మం నశించి, అధర్మం ప్రబలినప్పుడు ఆ పరమాత్మయే శిష్టరక్షణము, దుష్టశిక్షణము చేసి ధర్మసంస్థాపనం చేయడంకోసం రాముడు, కృష్ణుడు మొదలైన వివిధరూపాలలో అవతారం దాలుస్తుంటాడు. సంతుల (సాధువుల) సిద్ధాంతానుసారం ఆ పరమాత్మయే సాధకులకు జ్యోతిరూపుడుగా అనుభవంలోకి వస్తాడు. సంతులైనవారు (ఒక సంప్రదాయానికి చెందిన సాధువులు) ఆ పరమాత్మను పతిగాను, అమరలోకానికి అధిపతిగాను వర్ణించారు. ఆ పరమాత్మయే లోకంలో భక్తిప్రచారంచేసి దానిని ఉద్ధరించడంకోసం హంసరూపులైన సాధువులను క్రిందకు పంపుతుంటాడని వారే చెపుతుంటారు. అతడే దివ్య వైకుంఠాధిపతి, దివ్యగోలోకాధిపతి, దివ్య సాకేతాధిపతి, దివ్య కైలాసాధిపతి, దివ్యధామాధిపతి, సత్యలోకాధిపతి ఆదిగా విభిన్ననామాలతో పిలువబడుతుంటాడు. అతనిని పొందడమే పరమాత్మప్రాప్తి, మోక్షప్రాప్తి, పరమస్థానప్రాప్తి, పరమధామప్రాప్తి, ఆద్యస్థానప్రాప్తి, పరమశాంతిప్రాప్తి, అనామయపదవిప్రాప్తి, నిర్వాణము (పరమశాంతిప్రాప్తి) మొదలైన అనేక నామాలతో భగవద్గీతలోను, ఇతరేతరగ్రంథాలలోను నిరూపించడం జరిగింది. అదియే అన్నిటికీ పైన వెలుగొందే పరతత్త్వం. అదే భగవద్గీతలో ప్రతిపాదింపబడిన జ్ఞేయతత్త్వం దాని ప్రాప్తిస్వరూపాన్ని వివరిస్తూ భగవానుడు గీతలో

శ్లో. యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే ॥
(గీత. 6/22)

అనగా పరమాత్మ ప్రాప్తిరూపమగు ఏ లాభాన్ని పొంది, అంతకన్న అధికమైనదేదియు లేదని యెంచునో, మరియు పరమాత్మప్రాప్తి రూపమగు ఏ దశలో స్థిరముగ నిలచిన యోగి బహుగొప్ప దుఃఖములయందు కూడ చలింపక యుండునని భావము. ఆ స్థితిని పొందిన తరువాత ఇక మానవుడు ఎన్నడూ విచలితుడు కాడు. సాధారణముగా మానవుడు విచలితుడుకావడానికి కారణాలు రెండు. 1. ప్రాప్తించినదానితో తృప్తిని పొందకపోవడం. 2. అతడు ఉన్నచోట ఏదైన కష్టం వచ్చిపడడం. ఈ రెండు కారణాలను నిరాకరిస్తు భగవానుడు ఏమన్నాడో చూడండి- ఆ జ్ఞేయతత్త్వం ప్రాప్తించడంకంటే మించినలాభం మరేదీలేదు. దానిని తెలుసుకోవడం కంటే లాభదాయకమయిన విషయం వేరొకటి లేదు. ఎందుచేతనంటే? దానిని మించిన తత్త్వం వేరొకటిలేదు. ఆ తత్త్వాన్ని అనుభవానికి తెచ్చుకున్నవానిలో నేను సుఖభోక్తననే భావమే ఉండదు. కాబట్టి వ్యక్తిత్వమే లేని దశలో ఎంతటి పెద్ద కష్టం వచ్చిపడినా ఎవరు చలిస్తారు? ఎలా చలిస్తారు? అట్టి మహాపురుషుడు ఎప్పుడూ నిర్వికారరూపుడుగానే ఉంటాడు. అతడు గుణాతీతుడు అయిపోతాడు. ఇంకను భగవానుడు ఏమన్నాడో చూడండి-

శ్లో. ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి ॥
(గీత. 14/22)

శ్రీ భగవానుడిట్లనెను - ఓ అర్జునా! ఏ పురుషుడు సత్త్వగుణకార్య రూపమయిన ప్రకాశమును, రజోగుణకార్య రూపమయిన ప్రవృత్తిని, తమోగుణకార్య రూపమయిన మోహమును, గుర్తించి వానియందు ప్రవృత్తి దశలో ద్వేషముగాని లేక నివృత్తి దశలో ఆకాంక్ష కాని లేక యుండునో-

శ్లో. ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే ।
గుణా వర్తంత ఇత్యేవ యోஉవతిష్ఠతి నేంగతే ॥
(గీత. 14/23)

ఎవడు సాక్షీమాత్రుడై యుండి, గుణములచే చలింపబడక, గుణములే గుణములయందు వర్తించుచున్నవని తలంచుచు, సచ్చిదానందమైన పరమాత్మునిలో నేకభావమున స్థితుడై యుండునో, ఎవడట్టిస్థితి నుంచి విచలితుడు కాడో ;

శ్లో. సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాంచనః ।
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిందాత్మసంస్తుతిః ॥
(గీత. 14/24)

ఎవడు నిరంతరము ఆత్మ భావమందున్నవాడై సుఖదుఃఖముల సమానమెంచుచు, మట్టి, రాయి, బంగారముల సమమెంచుచూ , జ్ఞానియై, ప్రియాప్రియముల నొక రీతిగ నెంచువాడో మరియు ఆత్మ నిందాస్తుతుల యందు సైతము సమాన భావమున్న వాడో;

శ్లో. మానాపమానయోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః ।
సర్వారంభపరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే ॥
(గీత. 14/25)

ఎవడు మానావమానములయందు, శత్రుమిత్రాదులయందు సమముగనుండునో, సంపూర్ణముగ కర్మలయందు కర్తృత్వ అభిమానమును పరిత్యజించునో వాడు గుణాతీతుడని చెప్పబడుచున్నాడు.

భగవద్గీతలోని జ్ఞేయతత్త్వం యొక్క అనుభవంవలన ప్రాప్తించే ఫలం అదే.

~~~~oOo~~~~
~~~~

# 4. భగవత్ప్రాప్తియే జన్మసార్థక్య హేతువు

భగవత్ప్రాప్తికోసమే మనకు ఈ మానవశరీరం ప్రాప్తించింది. ఆ భగవత్ప్రాప్తిని జీవన్ముక్తి, తత్త్వజ్ఞానం, మోక్షప్రాప్తి, ప్రేమప్రాప్తి, పూర్ణత్వసిద్ధి, చరితార్థత మొదలైన నామాలతో కూడ వ్యవహరిస్తుంటాము. స్థూలదృష్టితో చూస్తే మానవుడికి, మానవేతరప్రాణులకు భేదం ఏదీలేదు. అన్ని శరీరాలు పంచభూతాత్మకాలే, ఆ శరీరాలలో వెలుగొందుతు ఉండే ప్రతి జీవుడు పరమేశ్వరుని ఒక అంశం అయినవాడే. చిన్మయుడే, "మమైవాంశో జీవలోకే" (గీత. 15/7) అన్న గీతావాక్యం ఇందుకు ప్రమాణం. యోనులు రెండు విధాలు. 1. భోగయోని. 2. కర్మయోని. మానవయోని కర్మయోనియే (సాధన చేయుటకు ఉద్దేశింపబడిన జాతి). ఈ యోనినే తులసీదాసు అటు స్వర్గమోక్షాలకు, ఇటు నరకానికి రెండిటికీ కూడ సోపానం అని వర్ణించాడు. ఈ మానవయోనిలో వైశిష్ట్యం ఏమంటే ఇందు చేయబడిన కర్మలను బట్టియే మోక్షంకాని, దేవయోనికాని, స్థావరయోనికాని, పశుపక్షి కీటకాదుల యోనులలో ఏదైనకాని ప్రాప్తిస్తుంటుంది. మానవజన్మలో చేసిన కర్మలను బట్టియే భోగవిధానం ఏర్పడుతుంటుంది. మానవయోనిలో కర్మస్వాతంత్ర్యం ఉంది. అంటే తన యిష్టానుసారం మానవుడు మంచికాని, చెడుకాని ఎలాంటి కర్మనైన చేయగలడు. చేయవచ్చును. మానవేతరయోనులలో అట్లుకాదు. అందు పూర్వం చేసుకున్న శుభాశుభకర్మలనుబట్టి ప్రాప్తించిన సుఖదుఃఖాదులను అనుభవిస్తూ జీవుడు సంసారచక్రంలో పరిభ్రమిస్తూ ఉంటాడు. ఎనుబది నాలుగు లక్షల జీవరాసుల యోనులు ఉన్నాయని, అవినాశియైన జీవుడు ఆ యోనులలో పరిభ్రమిస్తూ ఉంటాడని తులసీదాసుకూడ చెప్పియున్నాడు.

ఇతరయోనులలో జీవునకు కర్మస్వాతంత్ర్యం లేదు. ఆ కారణంగా ఆ యోనులలో ముక్తిమార్గాలు మూతపడి ఉంటాయి. ప్రతిజీవియందు అవ్యాజానుగ్రహాన్ని ప్రదర్శించేవాడు కావడంచేత భగవానుడు ఒక్కొక్కప్పుడు దయవహించి జీవునకు జననమరణరూప దుఃఖపరంపర నుండి శాశ్వతవిముక్తి పొందడానికి వీలుగా మానవయోనిని ప్రసాదిస్తుంటాడు.

ప్రతిమానవుడు తన జీవితానికి ఒక లక్ష్యం ఏర్పరచుకోవాలని, అలాచేస్తే దానిని అనుసరించి ప్రయత్నం చేయడానికి వీలు అవుతుందని కొందరు అంటుంటారు. కాని అలా అనడం యుక్తమైనదికాదు. విచారణ చేసి చూస్తే భగవానుడు ఆ లక్ష్యాన్ని ముందుగానే ఏర్పాటు చేసి ఉంచాడని విదితమౌతుంది. భగవానుడు ఎప్పుడు జీవునకొక లక్ష్యం ఏర్పరచినమీదటనే ఆ లక్ష్యం నెరవేరడంకోసం మానవశరీరం లభింపజేస్తూ ఉంటాడు. కాబట్టి మానవుడు కొత్తగా లక్ష్యం ఏర్పరచుకొనవలసిన పనిలేదు. ముందు నిశ్చయింపబడిన లక్ష్యాన్ని గుర్తించడమే కావాలి. భగవానుడు ఏదో ఒక ఉద్దేశ్యంతోనే మానవ జన్మను ఇవ్వడం జరుగుతుంది. జీవుడు తనమేలును తాను సాధించుకోవాలనే ఉద్దేశ్యంతోటే భగవానుడు వానిని మానవయోనికి పంపుతాడు. అతడు ముక్తినో ఉద్ధారమునో పొందడానికి అవసరమయిన సాధనసామగ్రినంతను అతడు ఆ యోనియందు ముందే సమకూర్చి ఉంచుతాడు. ఆ సాధనాలు కూడ బహు సరళమైనవి. సులభమైనవి, సర్వవిధాల మహత్త్వభరితమైనవి. అందుచేతనే మానవయోనిని తులసీదాసు సాధనాస్థానమని, మోక్ష ద్వారమని, సంసారసముద్రాన్ని దాటించే ఓడ అని పేర్కొన్నారు.

అయితే ఇప్పుడు ఇక్కడ ఒక ప్రశ్న ఉదయిస్తుంది. ఏమనంటే మానవుడు ఒక నిర్ణీతలక్ష్యంతోటి, నిశ్చితమైన ధ్యేయంతోటి జన్మించినప్పుడు ఆ లక్ష్యాన్ని ఆ ధ్యేయాన్ని పొందక ఇతర మార్గాలలో ఎందుకు తిరుగాడుతుంటాడు? అని. పరమాత్మను పొందుట అనే పవిత్రలక్ష్యంతో వచ్చినవాడు ఆ లక్ష్యాన్ని సిద్ధింపజేసే సాధనాపద్ధతులను ఎల అవలంబించుట లేదు? ఆ లక్ష్యానికి విరుద్ధముగా ఉండే మార్గాలను ఎందుకు అనుసరించడం జరుగుతుంది. అతడు ముందు నిర్ణీతమైన లక్ష్యాన్ని మరచిపోతున్నాడు. వానికి ఆ లక్ష్యం విషయం జ్ఞాపకం ఉండడంలేదు అన్నది ఆ ప్రశ్నలకు సమాధానం. అర్జునుని విషయాన్ని ఉదాహరణగా ! తీసుకుని పరిశీలిస్తే యీ విషయం బాగుగా బోధపడుతుంది. ఎలాగంటే భగవానుడు అర్జునునకు గీతోపదేశం చేసి "అర్జునా! నేను చేసిన ఉపదేశాన్ని నీవు శ్రద్ధగా విన్నావా? అజ్ఞానజనితమైన మోహం నీలో అంతరించిపోయిందా?" అని అతనిని ప్రశ్నించాడు. అప్పుడు అర్జునుడు హర్షవిస్ఫారితనేత్రుడై భగవానునివంకకు

చూస్తూ నాలోని మోహం అంతరించింది. నాకు స్మృతి కలిగినది. (జ్ఞాపకం వచ్చింది) ఇదంతా నీదయవలననే జరిగినది. నేనిప్పుడు పూర్వస్థితిలోనికి వచ్చినాను. అని అతనికి బదులు చెప్పినాడు. ఇక్కడ "స్మృతి కలిగింది" అంటే అనుభవమేదో కలిగిందని కాని, నూతనజ్ఞానమేదో ప్రాప్తించిందని భావంకాదు. మొదట అనుభూతి ఏదో కలిగింది. జ్ఞానం ఏదో ప్రాప్తించింది. కాని అది మోహావరణంతో ఆచ్ఛాదితమై విస్మృతం (మరపు) అయిపోయింది. ఇప్పుడు భగవానుడు చేసిన జ్ఞానోపదేశంతో ఆ మోహావరణం తొలగిపోయి పూర్వచైతన్యం మరల బహిర్గతమై ప్రకాశించినది. మరచిపోయిన విషయం జ్ఞప్తికి వచ్చినది అని భావం. వైశేషికులు స్మృతి అనే మాటకు ఇలాంటి వివరణమే చెప్పినారు.

"సంస్కార మాత్రజన్యం జ్ఞానం స్మృతిః" (తర్క సంగ్రహం).

ఈ విధంగానే యోగదర్శనాన్ని రచించిన పతంజలి మహర్షి కూడ "అనుభూత విషయాసంప్రమోషః స్మృతిః" అని సూత్రాన్ని రచించి పూర్వమందు అనుభవించిన విషయంతో స్మృతికి తాదాత్మ్యతను తెలియజెప్పెను. (ఈ సూత్రాన్ని అనుభవంలోనికి తెచ్చుకొన్న విషయం గుప్తం కాకుండ ఉండుట లేక ప్రకటమగుట స్మృతి యనబడును అని అర్థం) అర్జునుడు గీతలో చెప్పిన "స్మృతిర్లబ్ధా" (గీత. 18/73) అను మాటకూడ ఈ విషయాన్నే బలపరుస్తుంది. దీనిని బట్టి చూడగా అర్జునుడు తన లక్ష్యాన్ని మరచిపోయాడు అని స్పష్టం అవుతుంది. ఆ లక్ష్యాన్ని మరచిపోవడానికి ప్రధానకారణం మోహం. అందుచేతనే భగవానుడు– "కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ!" అని అర్జునుని ప్రశ్నించడం జరిగింది. ఇక్కడ ప్రయోగించబడిన "మోహ" శబ్దము పైనచెప్పిన భావాన్ని స్పష్టంగా మరింత బలపరుస్తుంది. వ్యాకరణశాస్త్రానుసారం మోహశబ్దం "ముహవైచిత్త్యే" అను ధాతువునుండి పుట్టింది. ఈ వైచిత్త్యము అనే మాటకు విచేతనత లేక విగతచేతనత (చైతన్యములేకుండుట లేక తొలగుట) అను అర్థం వ్యక్తమవుతుంది. అర్జునుడు ముందు స్పృహలోనే ఉన్నాడు. కాని తరువాత మోహగ్రస్తుడు అయ్యాడని ఇక్కడ మోహశబ్దప్రయోగం తెలియజేస్తుంది. మోహం తొలగడమంటే పూర్వచైతన్యాన్ని

పొందడమన్నమాట. అతని బుద్ధి మోహకలిలమును (మోహమనే బురద లేక కుళ్లు) అధికమించిపోనంతవరకు అతడు భగవదాజ్ఞను పాలించుటకు ఉద్యుక్తుడు కాలేదు. కాడు. "యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి' (గీత. 2/52) అని పలికి భగవానుడు అర్జునునకు ఈ విషయాన్నే తెలియజేశాడు. పూర్తిగా మోహం తొలగినప్పుడే సవ్యమైన విధంగా చేతన లభించడం సంభవమవుతుంది. అప్పుడు అర్జునుడు

"స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ ॥" (గీత. 18/73) అని బదులు పలుకుతాడు. అనగా నేనిప్పుడు సంశయము లేనివాడను ఆపై మీ ఆజ్ఞను పాలించువాడనని భావం.

ఇంతకు పై వివరణవలన తేలిన సారాంశమేమిటంటే జీవితానికి సంబంధించిన లక్ష్యము, లేక ధ్యేయము లేక ఉద్దేశ్యము అనేది ముందుగానే నిర్ణీతమై ఉంటుంది. దానిని క్రొత్తగా ఏర్పరచుకోవలసిన పనిలేదు. కేవలము దానిని గుర్తించడం మాత్రం కావాలి. గుర్తించిన మీదట దానిని సిద్ధింపజేసుకునే సాధన సుగమం, సరళం అవుతుంది. కలిగే కష్టం గుర్తించడం వరకు మాత్రమే. మానవజన్మాన్ని పొంది జాగరూకత వహించి చక్కగా ముక్తికోసం పాటుపడే మానవునికూడ అతడు ఏమరియున్న దశలో వచ్చి మీదపడి పెడత్రోవలలోనికి, పతనమార్గాలలోనికి పడద్రోసివేయగల ప్రబలమైన శక్తి మోహానికి ఉంది. ఉదాహరణకు మహాభారత చరిత్రనే చూడండి! సమరసన్నాహమంతా అర్జునుడు స్వయంగా తన చేతులతోనే పూర్తి చేశాడు. కురుక్షేత్రపు ధర్మభూమిలో కౌరవపాండవుల సైన్యాలు రెండుదిక్కుల నిలిచి శంఖాలను పూరించి తుములనాదం గావించి యుద్ధప్రారంభాన్ని సూచించాయి. అప్పుడు అర్జునుడు తానుకూడ తన దేవదత్త శంఖాన్ని పూరించెను. ఇక ఆయుధాలను ప్రయోగించడాన్ని ఆరంభించడమే తడవుగా ఉంది. అప్పటికి అర్జునుడు స్పృహలోనే ఉండి కర్తవ్యపరాయణుడైన క్షత్రియపుంగవునిలా "సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత" (గీత. 1/21)

"అచ్యుతా! ఇక నా రథమును ఉభయసేనలకు మధ్య నిలుపుడు" అని శ్రీకృష్ణునకు ఆదేశించాడు. "ఈ యుద్ధములో నేను ఎవరెవరితో యుద్ధం చేయవలెనో పరిశీలించి చూచుకుంటాను" అనికూడ అతడు అన్నాడు. ఆవేశపూరితాలు, వీరోచితాలయిన ఆ మాటలు విని భగవానుడు

కూడ వెంటనే రథమును ఇరుసేనలమధ్య నిలిపి "అదుగో! కురువీరులు! చూడు!" అని అర్జునునితో అనెను. అర్జునుడు అప్పుడు ఇరుపక్షాలలోను నిలిచి యుద్ధం చేయుటకు సిద్ధముగా ఉన్న తన కుటుంబంవారిని, స్నేహితులను, గురుజనులను, స్వజనాన్ని చూశాడు. తోడనే అతని హృదయంలో విషాదం ఆవరిస్తుంది. యుద్ధంవలన కలిగే పరిణామం యుద్ధంకంటే భయంకరమైనదిగా అతనికి తోస్తుంది. ఈ కులక్షయంవలన సుఖం కలుగుతుందనే ఆశకు బదులు సర్వనాశనపరంపర మొదలౌతున్నట్లు అతనికి అనిపిస్తుంది. ఆ దశలో అతనికి తన బ్రతుకు నిరర్థకంగా కానవస్తుంది. కుటుంబనాశనం చేయడంకంటే తాను మరణాన్ని శరణుపొందడమే మేలని అతడు అనుకుంటాడు. అప్పుడతనికి కర్తవ్యంలో అకర్తవ్యము, మేలులో కీడు, అర్థంలో అనర్థము గోచరిస్తాయి. మమకారానికి, ఆత్మీయతాభావానికి లోబడి అతడు ఆ యుద్ధాన్ని విరమించడమే ఉత్తమకర్తవ్యమనే నిశ్చయమునకు వస్తాడు. శ్రీకృష్ణభగవానుడు అతనిలో బయలుదేరిన యీ ఆపరాని మోహాన్ని క్లీబత్వం (నపుంసకత్వం) అని, కశ్మలం అని, అనార్యజుష్టం అని, (ఆర్యులు సేవించవలసినది కాదని) అస్వర్గ్యం (స్వర్గమునిచ్చునది కాదు అని, అకీర్తికరం (అప్రతిష్ఠను కలిగించేది) అని పేర్కొని దాని భయంకర పరిణామాలను గుర్తింపజేసి నిరసిస్తాడు. కాని అర్జునుని ఆవేశించిన మోహం దట్టమైనది కావడంచేత అతడు తన ఆలోచనలే మేలైనవని తలచి మరల ఏమేమో పలుకుతు పాడిన పాటనే పాడడం సాగిస్తాడు. బలీయములైన ప్రమాణాలతో తన భావాలనే బలపరుస్తూ అతడు శ్రీకృష్ణునితో పరమపూజ్యులైన భీష్ముని, గురువరులైన ద్రోణాచార్యుని నా వాడియగు బాణములకు ఎలా లక్ష్యం చేయగలను? అట్టి వారిని సంహరిస్తే గురుజనహింసా మహాపాతకంతోపాటు మనకు ప్రాప్తించేది వారి రక్తముతో పులుమబడిన హేయములైన అర్థకామభోగాలు మాత్రమే. ధర్మం కాని (మొదటి పురుషార్థం) మోక్షం (నాలుగవ పురుషార్థం) కాని ప్రాప్తించదు. కాబట్టి యుద్ధం చేయడంలో ఔచిత్యం నాకు ఏదీ కానరావడంలేదని ప్రతివాదం చేస్తాడు. ఈ విధముగా అర్జునునిమీద మహామోహం ఆవహించి అతన్ని కర్తవ్యవిముఖుని చేసేస్తుంది. అప్పుడు భగవానుడు అతనికి గీతాతత్త్వం ఉపదేశించి అతనిలో నెలకొన్న మోహాన్ని

పారద్రోలుతాడు. కాబ ! భగవద్గీత యన్నది మోహమహావ్యాధిగ్రస్తుల పాలిటి వారిలోని మో గాన్ని సమూలంగా నిర్మూలింపగల పరమౌషధం అన్నమాట.

మానవుడు {న నిర్దీతలక్ష్యమును సాధించే దిశగా అభిముఖుడుకానంతవరకు అతడు సాధారణ జీవుల యోనులందే తిరుగాడుతుంటాడు. ఆ స్థాయిని అధిగమించి విశిష్టస్థాయిని అందుకోలేడు. కాబట్టి తన శ్రేయస్సును, ఉద్ధారమును కోరుకొనే మానవుడు విస్మృతం అయిపోయిన తన చేతనను మరల పొందటానికి ప్రయత్నిస్తు ఉండడంలోనే అతని జన్మకు సార్థక్యం ఉంది. ఏ లక్ష్యం, ఏ కార్యం నెరవేరడానికి దుర్లభమైన యీ మానవశరీరం ప్రాప్తించినదో దానికి సంబంధించిన సాధనచేయక మానవుడు శరీరానికి, ప్రాణాలకు, ఇంద్రియాలకు అక్కరమాలిన ప్రాముఖ్యం ఇస్తూ కుటుంబమునందు, భోగసామగ్రులందు ఆసక్తిని పెంచుకుంటూ పోతున్నాడు. ఆ కారణముగా అతడు నిర్దీతమైన తన పవిత్రలక్ష్యాన్ని మరచిపోవడం జరుగుతుంది. సాధారణ జనసమాజంలో ఈనాడు ఈ పరిస్థితియే కానవస్తుంది. నిజం ఆలోచించి చెప్పాలంటే నేటి మానవుడు తనకు నిర్దీతం కాని యీ విరుద్ధదిశయందు ఎంత అభినివేశంతో ప్రవర్తిస్తున్నాడో ఆ అభినివేశంతోటే వివేకం వహించి తనకు నిర్దీతమైన లక్ష్యాన్ని గుర్తించుకొని దానిని పొందడానికి అవసరమయిన సాధనలో ప్రవర్తిస్తుంటే అతడు ముక్తుడు కావడానికి లేక ఉద్ధరింపబడడానికి మార్గం సుగమం అవుతుంటుంది. కాని ఈనాడు జరుగుతున్నది ఏమిటంటే అతడు ఒకప్పుడు స్వర్గాన్ని, ఒకప్పుడు అర్థాన్ని (ధనం), ఒకప్పుడు భోగాలను, ఒకప్పుడు కీర్తిని పొందడంకోసం అనేకవిధాల పథకాలను ఏర్పరచుకొనడంలో పరమాభినివేశంతో ప్రవర్తిల్లుతున్నాడు. అదే జీవితలక్ష్యమని, అదే జీవనమూల్యమని అతడు భావిస్తున్నాడు. ఈ విధముగా అతడు తననుతాను పరిభ్రమణ చక్రంలో పడవైచుకోవడానికి సహకరించే కుతంత్రాన్ని స్వయంగానే రచించుకుంటున్నాడు. భగవానుడు గీతలో కూడ చెప్పియున్నాడు

శ్లో. ఉద్ధరేదాత్మనాఽత్మానం నాత్మానమవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః ॥ (గీత. 6/5)

అనగా తననుతానే సంసారసాగరమునుండి ఉద్ధరించుకొనవలెను.

తనను, తానే అధోగతిలోనికి త్రోసికొనరాదు. ఎందుకనగా ఈ మనుష్యుడు తనకుతానే బంధువు (మిత్రుడు), మరియు తనకుతానే శత్రువు అగుచున్నాడు.

ఈనాటి మానవుడు ఆత్మోద్ధరణకోసం పాటుపడక స్వయంగా తమకు తామే శత్రువులు అవుతున్నారు. ఈ విషయంలో ఎంతని వ్రాసేది? ఈనాడు భౌతికంగా సమ్మానాన్ని పొందినవాడు మరియింత సమ్మానం పొందే అవకాశాలను అన్వేషిస్తున్నాడు. ధనికుడు మరింత ధనంకోసం ప్రాకులాడుతున్నాడు. గ్రంథరచయిత మరణానంతరం తన కీర్తిచంద్రికలు ఎల్లదిక్కులా వ్యాపించాలని ఆభిలషిస్తున్నాడు. పెద్దపెద్ద భవనాలను నిర్మించినవాడు ఆ భవనాల మూలంగా భౌతికంగా తన కీర్తిని చిరస్థాయిగా నిలిచేటట్లు చేసుకోవాలని ఉబలాటపడుతున్నాడు. ధర్మోపదేశాలు చేసే పండితుడు పరమార్థలక్ష్యాన్ని విస్మరించి లోకప్రసిద్ధి అనే క్షుద్రప్రయోజనానికి విశేషప్రాముఖ్యం ఇస్తున్నాడు. ఈ విధముగా ఈనాడు సర్వమానవప్రయత్నాలు నిర్ణీతమైన పవిత్రలక్ష్యం దిక్కుగాకాక దానికి విరుద్ధమైన దిశలో నిరాఘాటంగా సాగిపోతున్నాయి. దీని ఫలితంగా ఈ దిక్కుగా సాగిపోవడంలో మానవుని ఆకాంక్ష ఎంత ఉత్కంఠంగా ఉంటుందో అంతగా అతడు మానవత్వసంబంధమైన పవిత్రలక్ష్యానికి దూరమైపోతున్నాడు. కారణమేమంటే ఈ విషయాలన్నీ వ్యక్తిత్వాన్ని బలపరిచే విషయాలు. మానవుడు వ్యక్తిత్వాన్ని విడనాడి దాని స్థానంలో స్వస్వరూపాన్ని ప్రతిష్ఠించుకోవడమనేది జరగవలసిన విషయం. అతని ప్రయత్నమంతా చిన్మయత్వం (జ్ఞానపరిపూర్ణత) పొందడానికే జరగడం వాంఛనీయం.

ఉదాహరణకు ఒక మనుష్యుడు ఉన్నాడనుకోండి! అతడు తీర్థస్నానం చేయడానికి వెళ్ళినాడు. తీర్థానికి, జనసమ్మర్దానికి దూరముగ ఒక ధర్మశాలలో నిలిచెను. అచ్చట తనకు లభించిన స్థానాన్ని చక్కజేసుకోవడం, వంట చేసుకొనే ఏర్పాటు, ఇతరేతరములైన సుఖోపభోగసాధన సామగ్రులను సమకూర్చుకోవడం వంటి పనులలో నిమగ్నుడయ్యాడు. తీర్థస్నానంకాని, దైవదర్శనంకాని, తీర్థదర్శనంకాని, మహోత్సవదర్శనంగాని, సాధుజన సమాగమంగాని ఏదీకూడ చేయలేనంతగా అతడు ఆ పనులలో నిమగ్నమైనాడు. అట్టివానిని మనం

ఏమనాలి? హాస్యాస్పదుడనియే అనాలిగదా! అలాగే మానవుడు లోకంలోనికి ఎందుకు వచ్చాడు? అంటే భగవత్ప్రాప్తిని కోరి పాటుపడడం కోసం వచ్చాడు. కాని ఏమి చేస్తున్నాడు? సంగ్రహణం చేస్తున్నాడు భోగవిలాసాలకోసం పరుగులు తీస్తున్నాడు.

భోగప్రాప్తి మనలక్ష్యం కానేకాదు. కాని ప్రయత్నమంతా అందుకోసమే జరుగుతుంది. మానవజీవితానికి ప్రధానలక్ష్యం భగవత్ప్రాప్తియే. అయినా దానికి సంబంధించిన ప్రయత్నమేదీ సాగడంలేదు. శరీరం, ఇంద్రియాలు, ప్రాణాలు, మనస్సు, బుద్ధి, ధనము, వైభవము, భోగము మొదలైన పదార్థాలన్ని సాధనాలు మాత్రమే. అయినా విస్మృతిపథంలో నడుస్తున్న నేటి మానవుడు వానినే సాధ్యాలుగా చేసుకుని నిజంగా సాధ్యాలైనవానిని ఉపేక్షిస్తున్నాడు.

భగవానుడు జీవుని కల్యాణంకోసం నాలుగు పురుషార్థాలను ఏర్పరచాడు. అవి ధర్మ, అర్థ, కామ, మోక్షాలు. నాలుగు వర్ణాలు, నాలుగు ఆశ్రమాలు ఆ పురుషార్థాల విస్తారంకోసం ఏర్పడిన క్షేత్రాలు. వాని ద్వారానే పురుషార్థ సాధన జరుగుతుంది. నాలుగు పురుషార్థాలు నాలుగు కోరికలు. వానిని సాధించుకోడానికి రెండు సాధనాలున్నాయి. అవి ప్రారబ్దము, కృషి అనేవి. అందు కామం, అర్థం అనే పురుషార్థాలకు ప్రారబ్ధం ప్రధాన సాధనం. ధర్మం, మోక్షం అనే పురుషార్థాలకు కృషి ప్రధానసాధనం. అర్థాన్ని కామసాధనకు ప్రముఖసాధనముగా చేసి దాని దిక్కుగా నడిపించినప్పుడు ఆ అర్థం నిలువదు. నశించిపోతుంది. ధర్మాన్ని కామంతో సమ్మిళితం చేస్తే ధర్మం నశించిపోతుంది. ఇట్లుకాక అర్థాన్ని ధర్మంతో సంధానపరిస్తే అదికూడ ధర్మరూపాన్ని ధరిస్తుంది. అట్లుకాక ధర్మాన్నే అర్థమందు వినియోగిస్తే అది అర్థరూపాన్ని పొందుతుంది. ఈ విధముగా ధర్మ అర్థాలు రెండు ఒకదానిని ఒకటి పూరించేవి, ఉత్పన్నం చేసేవి అవుతాయి. కాని అవియే కామం దిక్కుగా ప్రయాణింపజేయబడినప్పుడు నశించిపోతాయి. కామనా రహితంగా సాగింపబడిన ధర్మము, అర్థము మోక్షసాధనకు సహకరిస్తాయి. నిష్కామభావంతో సాగిన కామప్రవృత్తికూడ (విషయసేవనం) ముక్తిమార్గానికి దోహదం చేసేదే అవుతుంది. కాబట్టి మానవుడెప్పుడు నిష్కామభావంతో ఆసక్తిని వీడి ధర్మంతో అనుసంధించి అర్థకామాల సాధనకు పాటుపడుతుండాలి. అర్థాన్ని సద్వినియోగం

చేస్తుండాలి. ధర్మంయొక్క గడిని దాటకుండా కామాన్ని సేవిస్తుండాలి. ఇట్టి పురోగమనమే మానవత్వం దిక్కుగాసాగే నిజమైన పురోగమనం అవుతుంది.

ఈ విధముగానే నాలుగు వర్ణాలవారు తమకోసం భగవద్గీతలో నిర్దేశింపబడిన వర్ణధర్మాలను అనుష్ఠిస్తే నిజమైన ముక్తిని లేదా లక్ష్యసిద్ధిని తప్పక పొందవచ్చును. ఆత్మకల్యాణాన్ని కాంక్షించే మానవుడు సుఖదుఃఖాది ద్వంద్వాలతో సంకులంగా ఉండే ఈ జగత్తునకు సంబంధించిన తుఫానుగాలులచేత విచలితుడుకాడు. తనకోసం నిర్ణీతమయిన కర్తవ్యమార్గంలో ప్రయాణించి పరమపదసిద్ధిని సాధించి తీరుతాడు. భగవానుడు గీతలో కూడ చెప్పియున్నాడు

"స్వేస్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః" (గీత. 18/45)

అనగా తమతమ స్వాభావిక కర్మలయందు తత్పరుడైన మనుజుడు భగవత్ప్రాప్తియైన పరమసిద్ధిని పొందుచున్నాడని భావం. ఈ విధంగానే ఆశ్రమాలు నాలుగుకూడ మానవుని లక్ష్యసిద్ధికి సహకరిస్తాయి. ఈ ఆశ్రమాలలో గృహస్థాశ్రమము, సన్న్యాసాశ్రమము ముఖ్యమైనవి. బ్రహ్మచర్యాశ్రమములో గృహస్థాశ్రమానికి, వానప్రస్థాశ్రమములో సన్న్యాసాశ్రమానికి వ్యవస్థ జరుగుతుంది. ఆశ్రమాలలో బ్రహ్మచర్యాశ్రమం మొదటిది. ఇందు ప్రవేశించి ముందుగా మానవుడు విద్యాభ్యాసము, ధర్మానుష్ఠానము చేస్తాడు. ఇక్కడ ఉండగానే అర్థకామాలయందు అతనికి విరక్తి కలుగడం జరిగితే అతడు ఈ మొదటి ఆశ్రమంలోనే ఉండిపోయి నైష్ఠిక బ్రహ్మచర్యాన్ని పాలిస్తు ఆత్మకల్యాణాన్ని సాధించుకోవచ్చును. వివేకంతోటి, విచారణతోటి ఈ ఆశ్రమంలో ఉండగా అర్థకామాల అపేక్షను జయింపలేనివానికి గృహస్థాశ్రమం కల్పింపబడి సిద్ధంగా ఉంటుంది. అతడు అందు ప్రవేశించవచ్చును. ఆ ఆశ్రమంలో ప్రవేశించి అతడు భోగవిలాసాదుల తాత్త్వికజ్ఞానం కలగడానికి వీలుగా ధర్మానుకూలమైన మార్గంలో అర్థకామాలను గూర్చి ఆచరణం చేయాలి. ఇదికూడ నిజలక్ష్యసిద్ధి దిక్కుగా ప్రయాణించడమే అవుతుంది.

అందువలన ధర్మంవలన విరక్తి కలుగుతుందని, యోగంవలన

జ్ఞానం కలుగుతుందని, జ్ఞానంవలన మోక్షం వస్తుందని చెప్పే వేదవాక్యంయొక్క ప్రామాణ్యం అనుభవంలోనికి రావడానికి వీలుకలుగుతుంది. ఎందుచేతనంటే ధర్మానుసారంగా గృహస్థాశ్రమపాలనం చేస్తేవైరాగ్యం కలుగడం తథ్యం. పరిమితభోగానుభవమే గృహస్థాశ్రమం. అపరిమితభోగాలకు బదులుగా గృహస్థునకు పరిమితభోగం ఎందుకు కల్పింపబడినది? అంటే తన నిర్ణీత పవిత్రలక్ష్యాన్ని విస్మరించకుండా ఉండడానికి. విధివిధానమును అనుసరించి పరిమితభోగాలను అనుభవించి వాని నిజస్వరూపాన్ని అర్థంచేసుకొని మానవుడు వానియందు విరక్తుడు కావాలన్నది అందులోని ఆంతర్యం. అట్లు విరక్తుడైనప్పుడే అతడు భగవత్ప్రాప్తిసాధనలో తత్పరతతోడ ప్రవర్తిల్లగలుగుతాడు. అలా ప్రాప్తించిన భోగపదార్థాలతో ప్రజారూపపరమేశ్వరుని సేవలో ప్రవర్తిల్లి గృహస్థుడు ఆ సేవారూపసాధనం ద్వారా కూడ పరమాత్మను పొందవచ్చును. ప్రజారూప పరమేశ్వరుని సేవకు అంకితమయిన సందర్భంలో గృహస్థుడు సేవకు సంబంధించిన సామగ్రిని అనగా ధనాదులగు ఉపకరణాలను, సాధనాలను అనగా అంతఃకరణము, ఇంద్రియాలు మొదలైనవాటిని కూడ ఆ పరమేశ్వరునివిగానే భావించుకోవాలి. ఈ వస్తువులు ఎవరివో వారి సేవకే వీనిని వినియోగిస్తున్నాను అనే భావం బలపడినమీదట ఆ సాధనసామగ్రులతో తనకున్న సంబంధం విచ్ఛిన్నమయిపోతుంది. "త్వదీయం వస్తు గోవింద! తుభ్యమేవ సమర్పయే" అన్న ఉక్తిని అనుసరించి (నీ వస్తువునే నీకు సమర్పిస్తున్నాను గోవిందా! అని ఈ ఉక్తికి అర్థం) ఆ సామగ్రులన్ని సేవ్యునకే (సేవింపబడువానికే) సమర్పింపబడిపోతాయి. తనదగ్గర మిగిలియున్న భోగసామగ్రి, సంగ్రహము సర్వము కేవలము ప్రజారూపపరమేశ్వరుని సేవాలక్ష్యాన్ని పూర్తి చేయుటకు ఉద్దేశింపబడినదే అన్న భావం బలపడినమీదట వానితోడ తనకున్న మమకారం పూర్తిగా విలుప్తం అయిపోతుంది. అలా జరిగినప్పుడు జీవునిలోని జడత్వం జడప్రపంచంలో కలిసిపోతుంది. దానితో సర్వవిధాల సంబంధవిచ్ఛేదం అయిపోవడంతో తన చేతనస్వరూపంలో తానునెలకొని ఉండడమనే ఉన్నతలక్ష్యం సహజంగా సిద్ధిస్తుంది.

ఈ తత్త్వాన్ని మరింత సుగమంగా అర్థం చేసుకోవడానికి వీలుగా

క్రింద మరికొంత విపులవివరణం ఇస్తున్నాము. మనం గుర్తుంచుకోవలసిన విషయమేమంటే ఇంద్రియాల ఉపభోగం మూడు విధాలుగా సాగుతుంటుంది. 1. భోగాలను తాత్త్వికంగా అర్థం చేసుకోవడానికి. 2. వానిద్వారా పరులకు సేవ చేయడంకోసం. 3. పరమాత్మప్రాప్తిని లక్ష్యంగాపెట్టుకొని శరీరనిర్వహణక్రియను సాధించుకొనుటకు. ఇప్పుడు ఈ విషయాన్ని విడివిడిగా విశ్లేషించి చుద్దాం.

భోగాల తత్త్వజ్ఞానం ఇక్కడ భోగాల తత్త్వం తెలుసుకోవడం అంటే వానిలో ఉండే సుఖం పరిమితమైనదనే విషయాన్ని తెలుసుకోవడం అన్నమాట. భోగాలలోని సుఖం పరిమితమనే విషయాన్ని తెలుసుకోవడానికి కూడ మనం భోగాభావపు దుఃఖాన్ని అనుభవించవలసి ఉంటుంది. కారణమేమంటే ఆ అభావపు దుఃఖం ఎంతప్రబలంగా ఉంటే భోగం అంత సుఖప్రదంగా ఉంటుంది. కాబట్టి అభావం కూడ అవసరమైనదే. అభావంలేనినాడు సుఖము ఉండదు. దానితోబాటు భోగమును అనుభవిస్తున్నప్పుడు భోగశక్తి క్షీణిస్తుంది. అది ఎంతగా క్షీణిస్తుంటే అంతగా భోగాపేక్ష ప్రబలుతుంటుంది. భోగపదార్థం అనిత్యమయినది. కాబట్టి అది నశిస్తుంది. భోగ్యవస్తువులు అనుక్షణము నశిస్తూనే ఉంటాయి. ఆ వస్తువులు నశించిన మీదట వాటి అనుభవసంబంధమైన సంస్కారాల స్మృతి చాల బాధను కలిగిస్తుంది. భోగాలకు సంబంధించిన యీ తాత్త్వికజ్ఞానం వానిని అనుభవించడంవలన ప్రాప్తిస్తుంది.

పరులను సేవించడానికి సంబంధించిన తత్త్వజ్ఞానం మానవునకు ముందుగా ఏవి ప్రతికూలపదార్థాలో, ఏవి అనుకూలపదార్థాలో తెలియాలి. ఆ విషయం తెలియనంతవరకు అతడు ప్రతికూలపదార్థాలను విడిచిపెట్టి అనుకూల పదార్థాలతోటి, క్రియలతోటి పరులకు సేవచేయలేడు. సేవాకాలంలో సేవకు ఉపయుక్తములయ్యే వస్తువులను సమిష్టికి చెందిన వస్తువులుగా భావించుకోవాలి. అలాచేస్తే ఆ వస్తువులమీద ఉన్న మమకారము, ఆసక్తి నశిస్తుంది. ఆ మమకారము, ఆసక్తి అంతరించనంతవరకు అనుకూలత, ప్రతికూలతలకు సంబంధించిన ద్వంద్వము నివృత్తం కాదు.

శరీరనిర్వహణక్రియ అనగా రాగద్వేషాలకతీతంగా ఉంటు

విషయాలను అనుభవించటం అన్నమాట. భగవానుడు గీతలో కూడ చెప్పియున్నాడు

శ్లో. రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి ॥
(గీత. 2/64)

అనగా తన ఆధీనము గావించుకొనిన అంతఃకరణము గల సాధకుడు, తనకు వశమైన రాగద్వేషములనొదలిన, యింద్రియాలతో విషయాలలో తిరుగాడుచుండియూ, అంతఃకరణ ప్రసన్నతను పొందుచున్నాడని భావం.

రాగద్వేషాలు కలిగియుండి విషయాలను చింతనం చేసే మానవుడు పతనాన్ని పొందుతాడు. కారణమేమంటే విషయాల చింతనంవలన మానవహృదయంలో వానియందు ఆసక్తి మొలకెత్తుతుంది. ఆ ఆసక్తి సర్వానర్థాలకు మూలం. ఆసక్తి మూలంగా దాని బుద్ధి భ్రష్టమై వానికి అంతిమ నాశనదశ సిద్ధమౌతుంది. "బుద్ధినాశాత్ ప్రణశ్యతి" (గీత. 2/63).

ఇక్కడ గ్రహింపవలసిన విషయమేమంటే రాగద్వేషరహితంగా విషయాలను సేవించడంవలనకూడ ప్రసాదము అనగా ప్రసన్నత ప్రాప్తిస్తుంది. అయితే యీ విషయసేవనం రాగద్వేషరహితంగాను, బహుసంయమపూర్వకంగాను కేవలము శరీరనిర్వహణం కోసం మాత్రమే జరగడం మంచిది. భోగబుద్ధితో జరగకూడదు. సరే! ఆ విషయాన్ని అలా ఉండనీయండి.

గృహస్థాశ్రమంలో ఉన్నవాడు ఆ ఆశ్రమానికి సంబంధించిన ధర్మాలను పాలించికూడ పరమాత్మను పొందగలడని ముందే చెప్పియున్నాము. అట్లు కానినాడు అతడు వానప్రస్థాశ్రమంలో ప్రవేశించి తితిక్ష (సహనశీలత) సంయమము (నిగ్రహము)లతో అనుబద్ధమై ఉండే విధముగా తీవ్రసాధన సాగించి పరమాత్మను పొందవచ్చును. అట్లు కానినాడు సన్న్యాసమునకు అర్హతను సంపాదించుకొని సన్న్యాసాశ్రమమును అవలంబించవచ్చును. ఈ ఆశ్రమములో ప్రవేశించినవాడు లోపల వెలుపల త్యాగలక్షణం కలిగియుండి నిరంతరం బ్రహ్మచింతనం చేసుకొంటు ఉండి కడపట పరమాత్మను పొందాలి.

జడచేతనముల రెండింటి గ్రంథియే జీవుడు. కావున మానవుడు జడాంశంచేత ప్రేరితుడై సుఖభోగాలను, సంగ్రహణాన్ని అభిలషించేవాడు అవుతాడు. చేతనాంశంచేత ప్రేరితుడై మోక్షాపేక్ష కలవాడు అవుతాడు. భోగేచ్ఛ, మోక్షేచ్ఛ ఈ రెండు ఇచ్ఛలలోను భోగేచ్ఛ ఎంత ప్రబలిపోయినను భగవత్ప్రాప్తి సంబంధమగు ఇచ్ఛను అంతరింపజేయజాలదు. జడత్వం చేతనత్వాన్ని ఆక్రమించి కొంతకాలం కప్పిపుచ్చగలదు. కాని దాని అస్తిత్వాన్ని హరించలేదు. ఒకవిధముగా చెప్పాలంటే భగవత్ప్రాప్తి సంబంధమైన కాంక్ష ప్రబలమైనప్పుడు అది భోగాపేక్షయొక్క అస్తిత్వాన్ని అంతరింపజేసివేయగలదు. కారణమేమన్న భోగము, దానికి సంబంధించిన ఇచ్ఛయు అనిత్యమే. పరమాత్మ, ఆ పరమాత్మయందలి ప్రేమ రెండూ నిత్యములైనవి. భగవానుడు, ప్రేమ రెండూ ఒకటే. లవలేశమైన భోగాపేక్ష మిగిలియున్నంతవరకు సాధనావస్థయే. సాధన చేస్తూనే ఉండాలి. పరమాత్మను పొందాలన్న కాంక్ష, మోక్షాపేక్ష, భగవత్ప్రేమపిపాస ప్రబలమైనప్పుడు భోగాపేక్ష క్షీణించిపోతుంది. అది క్షీణించిపోయినంతట నిత్యానంద స్వరూపుడగు పరమాత్మను పొందటం జరుగుతుంది. ఈ విధముగా మానవుడు తన లక్ష్యాన్ని సహజంగానే పొందుతాడు. అతడు ప్రాప్తవ్యాన్ని (పొందదగిన దానిని) పొందినవాడు, జ్ఞాతవ్యాన్ని (తెలుసుకోదగిన దానిని) తెలుసుకొన్నవాడు అయి కృతకృత్యుడు అవుతాడు. అలా కావడంలోనే మానవుని జీవనసార్థక్యం ఉంది.

~~~~oOo~~~~
~~~~

# 5. అఖండ సాధన

అఖండసాధన ఎలా ఉండాలి? అన్నది ఒక ప్రశ్న. సాధనము, సాధ్యము, సాధకుడు ఈ మూడింటి స్వరూపం ఎట్టిది? వీనికి ఏకత్వం ఎట్లు అన్నది ఒక ప్రశ్న. నిజమాలోచిస్తే యీ రెండు ప్రశ్నలు ఒకటే, నేను భగవానునివాడను, భగవానుడు నావాడు అనే యీ మాట ఏమిటో కొత్తగాను, వింతగాను తోస్తుంది. ఇది ఎలా అర్థం అవుతుంది? అనేది ఒక ప్రశ్న. మొత్తంమీద ఇది అది కూడ ఒకటే ప్రశ్న. వీనికి సమాధానం కూడ ఒకటే.

నిజం ఆలోచించి చూస్తే యీనాటి మానవుడు మూఢుడై తన శరీరంతోటి ఏకాత్మ భావం ఏర్పరచుకుంటున్నాడు. అనగా నేనే యీ శరీరాన్ని, శరీరమే నేను అని అనుకుంటున్నాడు. ఆ భావము వానిలో బాగా బలపడిపోయిన కారణంగా తాను భగవానునివాడు, భగవానుడు తనవాడు అనే విషయాన్ని అతడు గుర్తింపలేకున్నాడు. నిజం చెప్పాలంటే శరీరంతోటి మానవునకెట్టి సంబంధములేదు. సంబంధమున్నదని అనుకోవడమే జరుగుతుంది. "అహంకారవిమూఢాత్మా కర్తాహ మితి మన్యతే" అహంకారంతో విమూఢుడై మానవుడు సర్వమునకు తానే కర్తనని అనుకుంటున్నాడు. ఆ భావన బలపడినకొలది అదే నిజమని అతనికి తోస్తుంది. శరీరము, తాను ఒకటే అనే నిశ్చయం కలుగుటతో అదే సత్యమని అతనికనిపిస్తున్నది. నేను భగవానునివాడను, భగవానుడు నావాడు అనే భావన వానిలో బలపడినప్పుడు తాను, శరీరము ఒకటే అన్న భావన నిలువదు. వస్తుతః అతనికి శరీరంతో ఏకత్వం లేనేలేదు. మనం ఒకింత లోతుగా ఆలోచించి చూస్తే ఆదిలో మనకు ఈ శరీరంతోటి కాని, దీని సంబంధీకులతోకాని ఎట్టి సంబంధము లేదనే విషయం బోధపడుతుంది. తొంబై లేక వంద సంవత్సరాలకు ముందు ఇక్కడ సభలో కూర్చున్నవారిలో ఏ ఒక్కరికినీ ఇప్పుడున్న శరీరంతో సంబంధంలేదు కదా! మరి దీనికి సంబంధీకులతో సంబంధం ఎలా ఉంటుంది? నేటికి నూరేండ్లు దాటిపోయిన తరువాత మనకు ఇప్పటి యీ శరీరాలతో సంబంధం ఉండదుకదా! అట్టియెడ సంబంధీకులతో సంబంధం ఎలా ఉంటుంది? బాగా అర్థం చేసుకోండి. "ఆదావంతే చ యన్నాస్తి వర్తమానేऽపి తత్తథా" ఆది

అంతాలలో ఏదిలేదో అది వర్తమాన సమయంలోకూడ లేదు. ఆద్యంతములందు ఉన్నస్థితియే వర్తమానమందుకూడ ఉన్నదన్నదే సిద్ధాంతం. ఈ శరీరంతోటి, దీని సంబంధీకులతోటి భూతకాలంలో సంబంధంలేదు. భవిష్యత్తులో ఉండదు. కాబట్టి యిప్పుడు కూడ లేదు. అయితే శరీరంతో మనకు సంబంధం లేకపోతే మరి దేనితో ఉన్నదని అంటారా? మనకు ఆ సంబంధం పరమాత్మతోటి ఉన్నది. ఇదే సత్యం. శరీరంతోటి, కుటుంబంవారితోటి సంబంధం మనం అనుకొన్నట్టిది. కల్పించుకొన్నట్టిది. పరమాత్మతోడ సంబంధం స్వతస్సిద్ధం అయినట్టిది.

ఈ అనుకోవడానికి లేక కల్పించుకోవడానికి మూలం తెలియకపోవడమే (అజ్ఞానం) ఈ తెలియకపోవడం (అజ్ఞానం) అనేది క్రొత్తగా వచ్చేది కాదు. అనాదిసిద్ధమయినది. దానికి రావడమన్నది ఉండదు. పోవడం ఉంటుంది. ఎవరైన ఒకనిని నాయనా! నీకు ఫ్రెంచిభాష వచ్చునా? అని అడిగారనుకోండి, నాకు రాదు అని అతడు అంటాడనుకోండి, ఎప్పటినుండి? అని మళ్ళీ అడిగితే? అది ప్రశ్నకాదు. తెలియకపోవడం ఎప్పటినుండి? అనే ప్రశ్నయే ఉండదుకదా! కాబట్టి వేదాంతంలో అజ్ఞానాన్ని (తెలియకపోవడాన్ని) అనాది అన్నారు. అయినా ఈ తెలియకపోవడం (అజ్ఞానం) అనేది ఎక్కడనుండి వచ్చినదండి? మేము తెలుసుకోవాలని అనుకుంటున్నాం అని మీరు అనవచ్చును. దీనికి సరియైన సమాధానం చెప్పడం అయిపోయింది. అయినా అడుగుతున్నాం అని అంటారా? అయితే దానికి సమాధానం ఇది మీది కానిదానిని మీది అని మీరు ఎప్పటినుండి అనుకుంటున్నారో అప్పటినుండియే అది వచ్చింది. అయితే తనదికానిదానిని తనదని అనుకోవడం ఎందుకు జరుగుతుంది? అని మళ్లీ అడుగవచ్చును. దానికి ఒక కారణం అజ్ఞానం. కావున అనుకోవడమనేది అజ్ఞానం యొక్క కార్యం. మరొక్క విషయం ఏమంటే ఆ అనుకోవడమనే పనిని మనం దాని తత్త్వం తెలుసుకోవడంకోసం చేయాలి. కాని ఆ విషయం మరచిపోయి అనుకొన్నవిధముగా మనది కానిదానిని మనదని భావిస్తున్నాము.

ఉదాహరణకు ఈ విషయాన్ని గమనించండి! సంస్కారానుసారముగా ద్విజులైనవారికి ముందుగా బ్రహ్మచర్యాశ్రమపాలనం చేసి తరువాత గృహస్థాశ్రమంలో ప్రవేశించాలనే విధానం ఉంది. బ్రహ్మచారులు రెండు

విధాలుగా ఉంటారు. 1. నైష్ఠిక బ్రహ్మచారి. 2. ఉపకుర్వాణుడు. మొదటినుండి కడదాక బ్రహ్మచర్యాశ్రమములోనే ఉన్నవారు బ్రహ్మచర్యాశ్రమంనుండి మధ్య ఆశ్రమాలను వీడి కడపటిదైన సన్న్యాసాశ్రమంలో ప్రవేశించి యావజ్జీవం అఖండ బ్రహ్మచర్యాన్ని పాటించినవాడు నైష్ఠిక బ్రహ్మచారి అనబడతాడు. అట్లుకాక యధావిధిగా బ్రహ్మచర్యాశ్రమ పాలనం చేసి సమాప్తిస్నానం ఆచరించి తరువాత క్రమం తప్పకుండ గృహస్థాశ్రమపాలనం, వానప్రస్థాశ్రమపాలనము గావించి సన్న్యాసాశ్రమంలో ప్రవేశించినవాడు ఉపకుర్వాణ బ్రహ్మచారి యనబడతాడు. ఈ రెండు భేదాలు ఎందుకు అన్నది ఇక్కడి ప్రశ్న. ఎందుకంటే మనకు మానవశరీరం ప్రాప్తించేది పరమాత్మను పొందడంకోసం. పరమాత్మను పొందగోరేవాడు సంసారాన్ని త్యాగం చెయ్యాలి. సంసారత్యాగమంటే మనం హడలిపోతున్నాము. కాని సంసారత్యాగమంటే మనం ఇక్కడనుండి ఎక్కడకో పారిపోవాలని అర్థంకాదు. అడవిలోనికే పోయామనుకోండి. ఆ అడవి మాత్రం సంసారంకాదా? మనం ఏ శరీరంతో వెళ్ళుచున్నామో అది మాత్రం సంసారం కాదా? సంసారాన్ని విడిచిపెట్టడం అంటే శరీరము, ఇంద్రియాలు, అంతఃకరణం, మనస్సు, బుద్ధి, ప్రాణము మున్నగువానియందు అహంకారమమకారాలను పరిత్యజించడమని అర్థం. సంసారత్యాగమంటే ఇది. పరమాత్మప్రాప్తి కావాలని అనుకునేవాడు సంసారపరిత్యాగం చెయ్యాలి. అనగా సాంసారికవస్తువులందు అహంకారమమకారాలను పెట్టుకోవడానికి వీలులేదు. పెట్టుకుంటే పరమాత్మప్రాప్తి కలుగదు అనుట తథ్యం. మనం సంసారపరిత్యాగం చేయబోతే మనలోని రాగవృత్తి, సంగ్రహణేచ్ఛ, సుఖాభిలాష మనకు అడ్డు తగులుతాయి. సంసారసుఖాలను అనుభవించాలనీ, భోగవిలాసాలలో తేలియాడాలని సంగ్రహణానందాన్ని పొందాలనీ మనలో బలీయమైన కోరిక ఏది ఉంటుందో అదే త్యాగానికి అవరోధముగా నిలుస్తుంది. బ్రహ్మచర్యాశ్రమంలో ఉండగా ఈ లంపటాన్ని అంతను వీడి పరమాత్మ దిక్కుగా సాగిపోవాలి అని అనుకోవచ్చు. అలా అనుకున్నవారు విచారణద్వారా, వివేకంద్వారా, శాస్త్రంద్వారా, ఉపదేశంద్వారా సంసారపరిత్యాగం చెయ్యాలి. చేద్దాం అని అనుకోవచ్చును. అందుకు

ప్రయత్నం చేయవచ్చు. కాని దానితో మనస్సులో ఏర్పడిన బంధం బహుబలవత్తరమయినది. ఎంత ప్రయత్నించినా వాంఛలు పోవు. వారు దానిని విడిచిపెట్టలేకపోతారు. అలాంటి దశలో ఉన్నవానికై గృహస్థాశ్రమం ఏర్పాటు చేయబడింది. నాయనా! వెళ్లి గృహస్థాశ్రమంలో ప్రవేశించు! అందలి వస్తువులు ఎట్టివో, వాటి తత్త్వం ఎలాంటిదో అనుభవపూర్వకంగా తెలుసుకో! అని వానికి శాస్త్రం యొక్క ఆదేశం. అట్లుకాక విచారణద్వారా అర్థంచేసుకొని యీ లంపటాన్ని విడిచిపెట్టగల మనోనిగ్రహము, బలము గలవారయితే వారిని నైష్ఠిక బ్రహ్మచారివి అయిపో అంటున్నది శాస్త్రం. ఈ విధముగా రెండు మార్గాలు ఎందుకు ఏర్పడ్డాయి? అంటే ఆశ్రమాలను గ్రహించే అధికారులు రెండు విధములవారు అయ్యారు. గృహస్థాశ్రమం స్వీకరించడం ఎందుకు జరుగుతోంది? ఎవరు విచారణద్వారాను, వివేకం ద్వారాను భోగకాంక్షను తొలగించుకోలేకపోయినారో వారు ఆ ఆశ్రమంలో ప్రవేశించి అందలి విషయాలను అనుభవించి బాహ్యాభ్యంతరాల వాని తత్త్వం ఎట్టిదో బాగా అర్థం చేసుకొని వానిని (సంసారాన్ని) విడిచిపెట్టడం జరుగుతుందన్న ఉద్దేశ్యంతోటే గృహస్థాశ్రమంలో ప్రవేశించడం జరుగుతుంది. మొత్తంమీద సారాంశమేమంటే గృహస్థాశ్రమప్రవేశం అనేది త్యాగవృత్తిని బలపరచుకోవడంకోసమే కాని రాగవృత్తిని పెంచుకొని శాశ్వతంగా జననమరణాల ఉచ్చులలో బిగుసుకొనిపోవడానికి మాత్రం కాదు. అలా రాగవృత్తిని పెంచుకోవడం మన సంస్కృతి కానేకాదు.

ఇంతకు గృహస్థాశ్రమప్రవేశం అనేది త్యాగంకోసమే అన్న విషయము తేలిపోయింది. అజ్ఞానంతో సంబంధం పెట్టుకోవడమే గృహస్థాశ్రమప్రవేశం అంటే గార్హస్థ్యం అనగా సంసారమేకదా! సంసారము అజ్ఞానమూలకం కదా! దానితో సంబంధం అజ్ఞానంతో సంబంధమే అవుతుంది కదా! కాబట్టి గృహస్థాశ్రమప్రవేశం అనండి! అజ్ఞానంతో సంబంధం అనండి! ఎలా అన్నా ఒకటే. అజ్ఞానంతో సంబంధంపెట్టుకోవడం ఎందుకు జరుగుతుంది? అంటే త్యాగంకోసం అన్నమాట. అందుచేతనే దీనిని (గృహస్థాశ్రమాన్ని) స్వీకరించడం జరుగుతుంది. ఈ త్యాగం ముందే ఎందుకు చేయలేదు? అంటే చేయలేకపోయినారు కనుక. అయితే గృహస్థాశ్రమాన్ని స్వీకరించి ఏమి చేయాలి? శాస్త్రీయ విధానాన్ని అనుసరించి దాని ధర్మాలను పాటించాలి. శాస్త్రీయవిధానాన్ని అవలంబించడంతో

భోగానుభవానికి పరిమితత్వం వస్తుంది. దేశము, కాలము, వస్తువు -అన్నీ పరిమితాలు అవుతాయి. ఇలా అనుభవించు! అలా కాదు అనే శాస్త్రీయాలైన ఆదేశాలతో దాని నియమాలు కూడ పరిమితాలు అవుతాయి పరిమితపదార్థాలతో సంబంధం నియమబద్ధమైన భోగానుభవమనే రెండు విషయాలు ఉంటాయి. దీనినే ధర్మమంటారు. అనగా ధర్మబద్ధంగా గృహస్థాశ్రమపాలనం చేయాలన్నమాట. తరువాత ఏమవుతుంది? విశృంఖలంగా భోగాలను అనుభవించుటకు వీలు ఉండదు. ఇందువలన మన జీవనం నియమితం కావడం ఒకటి, త్యాగాన్ని సాధించడం మన ఉద్దేశ్యంగా ఒక విలక్షణదృక్పథం ఏర్పడడం ఒకటి. రెండు ప్రయోజనాలు కలుగుతాయి. ఒకదానివెంట ఒకటిగా ఈరెండూ ఉండడం వలన తప్పక వైరాగ్యం సిద్ధిస్తుంది.

ధర్మంవలన విరక్తి, యోగంవలన జ్ఞానము, జ్ఞానంవలన మోక్షము కలుగుతాయి అని వేదం చెప్పుతున్నది.

ఒక్క స్త్రీనే పెండ్లియాడు! అన్నది విధానం. దానితో ఆ భోగం పరిమితం అయిందా లేదా? అలాగే ఒక గార్హస్థ్యంలోనే ఉండు, ఒక పరివారంలోనే ఉండు, ఒక యింటిలోనే ఉండు, ఇది నీది. ఇది నీది కాదు. ఇలా పరిమితి లక్ష్యాన్ని పరిపుష్టం చేసేవిధానాలు అనేకాలు. ఇది నీది అని దేనిని అంటామో నిజం ఆలోచిస్తే అదికూడ నీది కాదు. కారణం ఏమంటే లోకమంతా ఒక్కటైనప్పుడు అందులోని ఒకయిల్లు నీది ఎలా అయింది? ఒక్క కుటుంబం నీది ఎలా అయింది? నీకు పరిమితంగా ప్రాప్తించే ఆదాయం (రూపాయలు) నీది ఎలా అయింది? సమిష్టిపదార్థాలనుండి ఒక్కొక్క పరిమితపు నమూనా నీకు ఈయబడిందన్నమాట. ఆ నమూనాను వినియోగించుకుంటు న్యాయపూర్వకంగా వ్యవహరిస్తు అందరను పోషిస్తు నీవు పరిమితంగా సుఖభోగాలను పొందాలన్నమాట. అనుభవించి చూడు ఆ నమునా ఎందుకో? తెలుసుకో. త్యాగంకోసమని స్పష్టపడుతుంది. అప్పుడు నీవు సహజంగానే త్యాగం చేస్తావు. ధర్మంవలన వైరాగ్యం కలిగితీరుతుంది. భాగవతం ఏమన్నదో చూడండి

శ్లో. ధర్మః స్వనుష్ఠితః పుంసాం విష్వక్సేనకథాసు యః ।
నోత్పాదయేద్యది రతిం శ్రమ ఏవ హి కేవలమ్ ॥

చక్కగా ధర్మానుష్ఠానం చేసినా భగవానుని పదములయందు ప్రీతి కలుగకపోతే ధర్మానుష్ఠానం జరగవలసిన విధంగా జరగలేదని, శ్రమ మాత్రమే మిగిలిందని అనుకోవాలి. "శ్రమ ఏవ హి కేవలమ్" ఇక్కడ నియమమేమంటే ధర్మబద్ధంగా విషయాలను సేవించడంవలన వైరాగ్యం కలుగుతుందనే మాట మాత్రం తథ్యం. ధర్మపూర్వకంగా విషయాలను సేవించడమెందుకు? మీరే ఆలోచించండి రాగవృత్తిని నశింప జేసుకోవడానికే కదా! ఆ రాగవృత్తి ప్రబలమైనప్పుడు మానవుడు దర్మకర్మాలకు ప్రాముఖ్యం ఈయడు. అనురాగంతో విషయాలనే సేవిస్తాడు. అందువలన విషయాలమీదనే మక్కువ ఎక్కువ అవుతుంది. కాని వైరాగ్యం కలుగదు ఈనాడు వృద్ధుడు అయిపోయిన మానవునకు వైరాగ్యం కలుగడంలేదు. అంటే దానికి కారణం ఏమిటి? భోగాలను కోరుతు భోగాలను అనుభవించడం. అనురాగపూర్వకముగా భోగాలనుభవించడం. సుఖాభిలాషతో భోగాలను అనుభవించడం. ఈ విధమైన ప్రవృత్తివలన బ్రహ్మయొక్క ఆయువు (నాలుగువేల యుగాలు బ్రహ్మకు ఒక పగలు. అదే క్రమంలో రాత్రి అయితే ఒకరోజు, అదే క్రమంలో వంద సంవత్సరములు) చెల్లినా వైరాగ్యం కలుగదు. భోగాలతత్త్వాన్ని అర్థంచేసుకుని వానిని పరిత్యజించివేసే ఉద్దేశ్యం పెట్టుకుని నియమపూర్వకంగా విషయాలను సేవించడం జరిగినప్పుడు మాత్రమే మానవునకు వానియందు విముఖత కలుగుతుంది.

ఈ ప్రపంచమంతా పాంచభౌతికం. ఇందులోసారం ఏమీలేదు. అంతా మట్టి, బురద, నీరు, దీనిని లోతులదాకా మేము పరీక్షించి చూసాము. ఇదంతా దగా, వంచన, ఇది అశుద్ధ పదార్థమే అని కొందరు అనుభవజ్ఞులు చెపుతున్నారు. అంతేకాదు ప్రపంచమంతా మాయాస్వరూపం. అందులో ఏదో రసం (రుచి, తీపి) ఉందని భ్రమపడి మానవుడు ప్రాపంచికసుఖాల వెంట పడుతున్నాడు. అనుభవించగా, అనుభవించగా అవి ఎప్పుడైతే ఉప్పగాను, కటువుగాను (రసహీనంగా) తోస్తాయో అప్పుడు వానితో మానవునకు సంబంధం తెగిపోతుంది. కాబట్టి నాయనలారా! మాయా రసపానం మానండి. భగవన్నామ సుధారసపానం చేయండి. శ్రీరామునియందు, శ్రీరామనామమునందు ప్రేమను పెంపొందించుకోండి! అని కొందరు తత్త్వవేత్తలైన సాధుపుంగవులు

చెపుతున్నారు.

ఒక గృహస్థుడు ఒక భార్యతోటి సంబంధం ఎలా జోడించుకుంటున్నాడో అలాగే మనం ఇప్పటి యీ శరీరంతో సంబంధం జోడించుకున్నాం ఎందుకు? త్యాగంకోసం. కాని ఆ విషయం మరచిపోయాం. దీని పేరే అజ్ఞానం. ఇదే మూర్ఖత్వం.

కాబట్టి మనం గుర్తుంచుకోవలసిన విషయమేమంటే మనం దీనితో సంబంధం ఏర్పరచుకోవడమన్నది కేవలము త్యాగం చేయడంకోసం మాత్రమే. అందుకోసమే పరీక్షించి చూచే దృక్పథంతో భోగానుభవముతో ప్రవర్తించడం పరీక్షించి చూచిన తరువాత దానిని విడిచిపెట్టివేయడమే జరగాలి. అలా చేసిననాడు మన మనస్సు మరలా ఆ దిక్కుకి తలత్రిప్పకుండా ఉంటుంది. ఉండాలి. ఈ శరీరంతో నాది అనే బంధం మనం కల్పించుకొన్నట్టిది. దానిని మనం విడువలేదు. అది మనలను విడిచిపెట్టలేదు అని అనుకున్నప్పుడు మనం ఏమి చేయాలి. అనుభవపూర్వకంగా దాని తత్త్వాన్ని తెలుసుకోవాలి. సమగ్రంగా దాని నిజస్వరూపాన్ని మనం అర్థం చేసుకున్నప్పుడు దానితో మనకు సంబంధం ఉండనే ఉండదు.

ఇందుకోసమే భగవానుడు సదయుడై ప్రపంచాన్ని రచించడములో ఒక చక్కని విధానాన్ని అవలంబించాడు. దానిని బట్టి లోకంలో ఎల్లకాలము ఏవస్తువు కూడ ఏకరూపంగా ఉండదు. అలా ఏకరూపంగా ఉండనట్టి సృష్టిరచనావిధానాన్ని అనుసరించి ఆ పరమాత్మ జీవులకు క్రియారూపంలో నాయనలారా! మీరు దేనితో సంబంధం పెట్టుకున్నా అది ఆ రూపంలో ఉండదు సుమా! అని ఉపదేశం చేస్తున్నాడు అన్నమాట. తమాషాకి ఇక్కడ భగవానునకు, జీవునకు నడుమ పంతగింపు మాటలు ప్రసంగాన్ని ప్రదర్శిస్తున్నాం చూడండి–

ఏమైనసరే నేను సంబంధం పెట్టుకోవడం మానను అని జీవుడంటాడు. ఏమైన సరే నేను ఆ సంబంధాన్ని త్రుంచివేయక మానను అని భగవానుడు అంటాడు. నేను చిన్నవాడను కదా! అని జీవుడు అంటాడు. నీ చిన్నతనాన్ని నిలువనీయను అని భగవానుడు అంటాడు. అయితే నేను పడుచువాడను అంటాడు జీవుడు. ఆ పడుచుదనాన్ని కూడ నిలువనీయను అంటాడు భగవానుడు. నాకు ఇంత కుటుంబం (అంగబలం)

ఉంది అంటాడు జీవుడు. దానినీ హరించివేస్తాను అంటాడు దేవుడు. నా దగ్గర బోలెడు డబ్బున్నదయ్యా! అని జీవుడు వాదిస్తాడు. అది కూడ ఉండకుండ చేస్తాను అని భగవానుడు ప్రతివాదం చేస్తాడు. నేను చాల బలవంతుడను, ఆరోగ్యవంతుడను అని జీవుడు అంటాడు. ఆ స్వాస్థ్యాన్ని కూడ నిలువనీయను అని భగవానుడు అంటాడు. నేను వ్యాధిగ్రస్తుడనయ్యా అని జీవుడు పలుకుతాడు. దానినీ ఉండనీయను అంటాడు భగవానుడు. నీవు ఏది నాది నాదని అనుకుంటూ ఉంటావో దానిని నేను నీకు దూరం చేసేస్తుంటాను. నీవు సంబంధం జోడించుకుంటుపోతే నేను దానిని విచ్ఛేదము చేస్తుంటానురా జీవా! అని ఆ దేవుడు హెచ్చరిస్తునే ఉంటాడు.

ఇక్కడ సంబంధాన్ని త్రెంచడమంటే ముందు నూత్నసంబంధాన్ని జోడించడమన్నమాట. అలా జోడించడం జరిగితే పాతసంబంధం దాని యంతట అదే తొలగిపోతుంది. కారణమేమంటే అది ఊడిపోయేదే కాబట్టి.

ఓరి పామరుడా! కడకు అన్నీ నిన్ను వదలిపోయేవే అని గుర్తుంచుకో? అయినా విడువనంటావా? తరువాత పశ్చాత్తాప పడవలసివస్తుంది అనే యీ మాట ఒక కవి భావన.

కాబట్టి దేనితో సంబంధం పెట్టుకొన్నా దాని తాత్త్వికరూపం తెలుసుకోవడానికే కాని ఆ బంధాన్ని స్థిరంగా నిలుపుకోవడంకోసం కాదు.

అంతేకాదు మనం ఎవరిని సాధువులని, మహాత్ములని, విరక్తులని, త్యాగులని, ఉత్తములని భావిస్తామో వారితో సంబంధం జోడించుకోవడం కూడ ఆ సంబంధాన్ని త్రెంచుకోవడం కోసమే అన్నమాట మనం మరిచిపోకూడదు. ఈ మాట కొంచెం కటువుగా ఉంటుంది. కాని అదే నిజం. ఒకడు గృహస్థాశ్రమం వీడి సాధువు అయిపోయాడు అనుకోండి, అతడు ఒక గురువుతో సంబంధం జోడించుకుంటాడు అంటే ఆ గురువుతో సంబంధం శాశ్వతంగా నిలుపుకోవడం కోసమా? కాదు. గురువు అతనితో ఏమంటాడు? నాయనా! లోకంలోని వ్యక్తులతోటి వస్తువులతోటి సంబంధం శాశ్వతంగా నిలిచేది కాదు. నీ నిజ స్వరూపంతో ఉండే సంబంధమే శాశ్వతమైనది అని చెపుతాడు. కాబట్టి దేనితో సంబంధం పెట్టుకున్నా ఆ సంబంధాన్ని త్రెంచుకోవడానికే కాని దానితో పాటుగా నశించిపోవడానికి కాదు. ఈ జోడించుకున్న సంబంధమే శాశ్వతమని మనం అనుకుంటున్నాం. అది మనం చేస్తున్న పొరపాటు. మనం శరీరంతో

సంబంధం పెట్టుకున్నాము. దానిని నాది అనుకున్నాం. అలా అనుకోవడమే పొరపాటు. అయితే మనం ఏమి చెయ్యాలి? అన్నది ప్రశ్న.

'శరీరమే నేను' అని అనుకుంటు ఉండడముచేతనే నేను భగవానుని వాడను. భగవానుడు నావాడు అనే భావం మనకు స్ఫురించడం లేదు. ఈ విషయం మనకు అవగాహనకు రాకపోవడానికి మనం శరీరంతో తాదాత్మ్యము, ఏకాత్మభావము ఏర్పరచుకోవడమే కారణం. నిజం చెప్పాలంటే జీవుడు దేవునివాడు, దేవుడు జీవునివాడు అనడం తథ్యం. ఇదే వాస్తవికసంబంధం. అందుచేతనే నిజమైన మహాపురుషులు, సాధువులు నాయనా! నీవు భగవానుని వాడవు భగవానుడు నీవాడు. ఈ శరీరం నీవు కాదు అనియే ఉపదేశిస్తుంటారు.

శరీరంతోటి నేను అనే భావన లగ్నమై ఉన్నంతవరకు అఖండసాధన జరుగదు. అఖండ సాధన ఎలాగ? అనికదా ప్రశ్న, ఎంతవరకు ఈ శరీరంలో అహంకారము (నేను అనే భావము) మమకారము (అది నాది అనే భావము) ఉంటుందో అంతవరకు సాధన అఖండంగా సాగదు. అఖండం అంటే ఏది? ఖండం అంటే ఏది అని ఒకింత ఆలోచించి చూడండి! నేను అనే భావనయే అఖండంగా ఉంటుంది. మిమ్మి ఎప్పుడైన ఎవరు? అని అడిగితే మీరు నేను అని బదులు చెపుతున్నారు. ఆ నేను అనే భావాన్ని మీరు బాగా జ్ఞాపకం ఉంచుకోవచ్చును లేదా గాఢనిద్ర మిమ్ము క్రమ్మివేయవచ్చును లేదా వ్యవహారములయందు మరచిపోవచ్చును కాని నేను ఫలాన వర్ణంవాడను, ఫలాన ఆశ్రమంవాడను, అనే విషయం మాత్రం జ్ఞాపకం చేసుకోవలసిన పనిలేకుండానే జ్ఞప్తియందు ఉంటుంది. మీరు ఏ పనిలో నిమగ్నం అయ్యారో కూడ మీకు గుర్తుండకపోవచ్చును. కాని ఒకింత జాగరూకతవహించే సరికి నేను అనే భావన మాత్రం గుర్తుకు వచ్చేస్తుంది. అప్పుడు అదే పేరు, అదే నామం, అదే గ్రామం, అదే ఆశ్రమం, ముందున్న అదే మీ పరిస్థితి అన్నీ స్వప్నంలోకూడ గుర్తుకు వచ్చేస్తుంటాయి. కాబట్టి 'నేను' తో జోడింపబడిన సంబంధం అఖండమైనది. ఈ 'నేను'ను భగవానునితో ముడిపెట్టక సంసారంతో ముడిపెడుతున్నాం. సాధన మాత్రం అఖండముగా సాగించాలని అనుకుంటున్నాం. అది ఎలా సాధ్యమవుతుంది? అసంభవం. ఈ చెవితో వినండి లేదా ఆ చెవితో, మీరు ఒప్పుకోండి ఒప్పుకొనకపోండి,

ఇందుకు ప్రమాణం ఉండనీయండి లేకపోనీయండి, నాయనా! మాకు మాత్రం ఈ విషయంలో సందేహం కొంచెంకూడ లేదు. మీకు సందేహముంటే మీరు నమ్మడం మానేయండి. మీతో మాకు పంతమేదీ (ఆగ్రహం) లేదు.

ఏళ్లతరబడి కొందరు సత్సంగ భజనాదులు చేస్తూనే ఉంటారు. కాని నిరంతరభజనం సాగుతుంది అనడానికి వీలులేదు. అందుకు కారణాలు అనేకం. వానిలో ప్రధానమయినది అహంకారం (నేను అనే భావన)తో సాధనకు సంబంధం లేకపోవడం. సాధన చేస్తున్నారు. కాని చింతనం సంసారపరంగా జరుగుతున్నది. వాస్తవికత్వాన్ని విడిచిపెట్టేస్తున్నారు. కృత్రిమత్వాన్ని పట్టుకుంటున్నారు. వాస్తవికత్వాన్ని విడువకుంటే సాధన అఖండం అవుతుంది. నకిలీ (కృత్రిమ) ప్రక్రియ అఖండం ఎలా అవుతుంది? మనం నకలు(అనుకరణ, కృత్రిమం) చేస్తాం. అది మన సంబంధంనుండి విడిపోతుంది. మళ్లీ చేస్తాం మళ్ళీ విడిపోతుంది. అయితే మనం ఏమి చెయ్యాలి? మనం అఖండసాధన చేయాలి అనుకుంటే నేను భగవానుని వాడను అనే భావాన్ని మనలో ప్రతి ఒక్కడు అర్థం చేసుకోవాలి. అనుకోవాలి. ఒప్పుకోవాలి. పరమాత్మతో సంబంధం ఏర్పరచుకున్న తరువాత సాధన చెయ్యాలి అనే బాధ్యత వస్తుంది. సాధనే చేయాలి అనుకోవడం వేరు సాధనకూడ చేద్దాం అనుకోవడం వేరు. మా సోదరుడు, సోదరికూడా సాధన చేస్తారు. సాధన చేద్దామని అనుకుంటే రోజూ గంటయో, రెండుగంటలో సమయం దానికి వినియోగిస్తాం. ఏడాదికి మూడు నాలుగు మాసాలు అందుకు వినియోగించినట్లు అవుతుంది. మిగిలిన కాలం గృహకృత్యాలకు వినియోగింపబడుతుంది. ఇలా అయితే సాధనకు అఖండత్వం ఎలావస్తుంది. ఈ సంసారం నాది అని మనం ఎంతవరకు అనుకుంటుంటామో అంతవరకు దానితో మనకు సంబంధం ఉంటూనే ఉంటుంది.

నిజం ఆలోచించి చూస్తే సంసారంతో సంబంధం ఇంతకు ముందు ఉన్నదీ కాదు. భవిష్యత్తులో ఉండేదీ కాదు. నేను ఈ మాటను స్థూలదృష్టితో చెబుతున్నాను. సూక్ష్మదృష్టితో పరికిస్తే ఆ సంబంధం అసలు లేనేలేదు. ఒక్కక్షణంకూడ లేదు. ఉదాహరణకు గంగాజలం ఉంది చూడండి, అది నిరంతరం ప్రవహిస్తూనే ఉంటుంది. క్షణంకూడ స్థిరంగా

ఉండదు. కాని స్థూలదృష్టితో చూస్తే నిన్నటినుండి నీరు మెట్టుమీదనే ఉంది. ఈనాడు కూడ అలాగే ఉంది. ఆ పరిమాణంలోనే ఉంది అని అంటాం. కాని సూక్ష్మదృక్పథంతో చెప్పాలంటే ఒక్కక్షణంకూడ ఆ నీరు అక్కడ నిలువలేదు. నిన్న ఉన్నవిధంగాను లేదు. ఒక్కక్షణం ముందున్న విధముగానూ లేదు అనియే చెప్పాలి. ఒక్కక్షణం తరువాత కూడ అక్కడే నిలిచేది అయితే అక్కడే శాశ్వతంగా స్థిరంగా ఉండాలి. కాని అలా ఒక్కక్షణం అయినా స్థిరంగా ఉండేది కాదు కదా? ఆ విధముగానే ఈ శరీరం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, ప్రాణం ఒక్క క్షణం కూడ స్థిరంగా ఉండేవి కావు. కారణమేమంటే –

'క్షణపరిణామినో భావా ఋతే చితిశక్తేః'

ఒక్క ఆ చేతనశక్తి తప్ప మిగిలినవన్నీ అనుక్షణపరిణామ (మార్పు) లక్షణం కలవి. అనుక్షణ పరిణామం చెందేవాటిలో నాది, నేను అనే బంధాన్ని మనం ఏర్పరచుకున్నాం. అందుచేతనే నిజంగా నాది అనుకోవలసినది మనకు కనిపించకుండా పోయింది. అయితే నేను భగవానుని వాడను, భగవానుడు నావాడు అనే అంశం తెలియబడడం ఎలాగన్నది ప్రశ్న. వస్తుతః భగవానుడే మనవాడు. మరెవ్వరు మనవారు అనుకోదగినవారు లేరు. మనవి అని అనుకోవలసిన వస్తువులు లేవు. లోతుగా పరిశీలించి, ఆలోచించి చూడండి మనవాడనదగినవాడు ఎవ్వడు లేడు. అంతయేల? మనదని అనుకుంటున్న ఈ శరీరం కూడ మనది కాదు. శరీరమే మనది కానప్పుడు ఇక మనది మనవాడు అని అనుకోవడానికి ఇతరం ఏముంటుంది? సంబంధం జోడించుకున్నంత మాత్రాన శరీరం మనదెట్లు అవుతుంది?

అయితే ఇప్పుడు మనం ఏం చెయ్యాలి? అంటారు మీరు. శరీరంతోటి, సంసారంతోటి ఆత్మీయతాబంధం మాలో వేళ్లు నాటుకొని యున్నది. దానిని తొలగించుకోవడం ఎలాగ? అని అంటారు మీరు. దీనికి ఒక చక్కని ఉపాయముంది. దానిని స్త్రీలు, పురుషులు, పిన్నలు, పెద్దలు, చదువుకున్నవారు, చదువుకోనివారు అందరు అనుసరించవచ్చును. అది యేమిటంటారా? సాధకునకు ఒక జీవనం ఉంది. దానిని రెండు విభాగాలు చేయండి. అందులో ఒకటి వాస్తవమైనది. రెండవది నకిలీది (కృత్రిమమైనది, తెచ్చిపెట్టుకున్నది) అని అనుకోండి. ఎలాగంటే నటుడు ఉంటాడు

చూడండి. వాడు తన పాత్రకు తగిన వేషం వేసుకుంటాడు. ఆ వేషాన్ని వాడు నకిలీది అనియే భావిస్తాడు. కాని వాస్తవమైనదిగా భావించడు. అలాగే ఆ వేషానికి ముందు అతనిలో 'నేను' అనే భావన ఏదైతే ఉన్నదో దానిని వాస్తవమైనదిగా గుర్తిస్తాడు. కాని నకిలీది అని భావించడు. అలాగే మనం ఈ శరీరాన్ని ధరించాము. కాని ఇది మన నిజరూపంకాదు. ఇది యీ జగన్నాటకంలో మనం నటించేపాత్రకు తగినట్లుగా మనకు ప్రాప్తించినవేషం అన్నమాట. దీనితో 'నేను, నాది' అనే బంధాన్ని కల్పించుకుని మనం నటిస్తున్నాం. అంటే మనం భగవానునివారమే కాని సంసారంలో నటించే పాత్రను మనం తీసుకున్నాం. అందుకు తగిన వేషం మనకు లభించిందన్నమాట. కాని నేటి మన వ్యవహారం ఇందుకు విరుద్ధంగా ఉంది. మనం సాంసారికులుగా ఉంటున్నాం. మన వేషం భగవద్భజన సంబంధముగా సాగిస్తున్నాం. నటనకోసం భగవద్భజనం చేయడం మొదలుపెడితే అది దృఢంగా ఎలా ఉంటుంది? అఖండముగా ఎలా సాగుతుంది? అది అఖండసాధనకాదు, కాజాలదు. పాత్ర లేక వేషము అఖండం ఎలా అవుతుంది? ఆ వేషం నటించే కాలంలో మాత్రమే ఉంటుంది. నటన అయిపోయిన తరువాత ఉండదు. అయితే మనం ఇప్పుడు దానిలో మార్పు తీసుకురావాలి. నేను భగవానుని వాడను భగవానుడు నావాడు అని అనుకొనే విధంగా మార్చుకోవాలి. ఈ శరీరానికి ముందు నేను శరీరాన్ని కాను. నాదిగా శరీరంలేదు. ఇటుమీదట కూడ ఈ నేను అనుకునే వస్తువు నాదిగా ఉండదు. కాని నేను అనేది (ఆత్మ) మాత్రం ఉండిపోతుంది. అది భగవానునిది అని అనుకుంటే భగవానునిది. అనుకోకపోతే తనకుతాను విడిగా ఉంది అనుకోండి.

ఒకప్పుడు మీరు చిన్నపిల్లవాడుగా ఉన్నారు. కాని ఇప్పుడు వృద్ధులు అయిపోయారు. మీ శరీరం ఆనాడున్న విధముగా ఈనాడు ఉన్నదా? లేదు. సాంగత్యము నాటిది లేదు. బంధము నాటిదిలేదు. వేషము అప్పటిది కాదు. కాలము అదికాదు. వయస్సూ అది కాదు. సంవత్సరము అది కాదు. అయినా అదే నేను అని మీరు అంటున్నారంటే చాల ఆశ్చర్యం కలుగుతుంది. అనుభవమనేది అన్నిటికి సంబంధించి ఉంటుంది. కాని దానికి మనం ప్రాముఖ్యం ఇవ్వడంలేదు. వస్తుతః అది నేను కాదు. నేను నేనే అది అఖండమైనది. చిన్ననాటి నేనే ఇప్పుడు కూడ

నిలిచియున్నది. బుద్ధియా? భావనయా? లక్ష్యమా? ఉద్దేశ్యమా? మొదటినుండి నాది అదే అని ఇందులో మీరు దేనిని పేర్కొనగలరు? దేనినీ పేర్కొనలేరు. కారణం? ఇందులో ఏదీకూడ నాటినుండి నేటివరకు ఒక్క విధముగా లేదు. కాని మీలోని 'నేను' మాత్రం అదే. శరీరం అప్పటి విధముగా లేదు. పరిస్థితులు అప్పటి విధముగా లేవు. అదే అని చెప్పడానికి వీలుగా దేశము లేదు, కాలములేదు, వస్తువులేదు, బంధకములేదు, అవస్థయూ లేదు, ధ్యేయములేదు, తెలివియులేదు. ఆలోచనయులేదు. ఇవన్నీ మారిపోయినవే అయినప్పుడు వీనితో మీకు సంబంధమెలా కుదురుతుంది. వీనిని నావి అని మీరు ఎలా అనగలరు.

ఇదంతా నటన, అనుకరణం, వీనినన్నిటినీ గుర్తిస్తున్న వారుగా మీరు వేరు. ఆ గుర్తించేది మీలోని 'నేను' అది మాత్రమే భగవానునిది. మిగిలినవన్నీ సాంసారికవస్తువులు. పాత్రపోషణం చేసేవానికి ఆ పాత్రను నాటకకంపెనీ ఇస్తుంది. వేషం కూడ (దుస్తులు) అదే ఇస్తుంది. నటించవలసిన రంగస్థలం కూడ కంపెనీవారిదే అవుతుంది. వారు ఇచ్చిన పాత్రనే గ్రహించి వారు కల్పించిన రంగస్థలం మీదనే వారి ప్రసన్నతకోసం, ప్రేక్షకుల ప్రసన్నతకోసం నటించడం జరుగుతుంటుంది. ప్రేక్షకుల ప్రసన్నత కూడ కంపెనీ నాయకుని ప్రసన్నతకోసమే. ప్రేక్షకులు మెచ్చుకోకపోతే నాయకునివలన పారితోషికాలు, బహుమానాలు రావు. ఆ విధముగానే ఈ మహా జగన్నాటకంలో మనకు లభించిన పాత్రను మనం చక్కగా పోషించాలి. తదనుసారంగా మహామహాకార్యాలను సాధించాలి. ఏమి చేస్తున్నా నటిస్తున్నామని అనుకుంటూనే చేయాలి. ఇలా చేయడమే ధర్మానుష్ఠానం అనబడుతుంది.

పాత్రను అనుసరించి నటించడానికి సహకరించే పుస్తకం ఒకటుంటుంది. మీరు ఈ మాటలు పలకాలి. వారు ఆ మాటలు పలకాలని ఆ పుస్తకంద్వారా నటులకు నేర్పడం జరుగుతుంటుంది. ఆ విధముగానే మన నటనకు సంబంధించికూడ పుస్తకాలు ఉన్నాయి. వానిలో గృహస్థుడు ఇలా చేయాలి. పురుషుడు ఇలా చేయాలి, స్త్రీ యిలా చేయాలి. కొడుకు ఇలాచేయాలి అని వ్రాయబడి ఉంటుంది. దానిని అనుసరించి చేసే నటనంతా ప్రజల ప్రసన్నతకోసం చేయాలి ఆహా! ఈ గృహస్థాశ్రమం ఎంత బాగుంది? అని పదుగురు మెచ్చుకొనే విధముగా మన కార్యప్రవృత్తి

సాగాలి. కాని కేవలం పదుగురిచేత భేష్! భేష్! అనిపించుకోవడం, దండలు వేయించుకోవడం మాత్రం ప్రధానలక్ష్యం కాకూడదు. కేవలము ఆసక్తిని తొలగించుకోవడంకోసం తనకు లభించిన పాత్రను అనుసరించి భగవదాజ్ఞాపాలన దృక్పథంతో నటిస్తుండాలి. కాని అదే నిజమని అనుకోరాదు. ఇలా చేయడమే కర్మయోగం అనబడుతుంది.

ఈ విధముగా చేయడంవలన ఆసక్తి తగ్గుతుంది. రాగం క్షీణిస్తుంది. అందుచేతనే "ధర్మ తె భిరతి" ధర్మంవలన వైరాగ్యం కలుగుతుందని చెప్పడం జరిగింది. ధర్మాన్ని విడిచి కేవలం ఆసక్తితో విషయాలను సేవిస్తుంటే వైరాగ్యం ఎంతమాత్రం ప్రాప్తించదు. కాబట్టి మనకు వైరాగ్యం ప్రాప్తించాలన్న ఉద్దేశ్యమే ఉండాలి. దానినే నియమముగా పెట్టుకోవాలి. లభించిన పాత్రను బట్టి చేసే ప్రతి పనీ సర్వశ్రేష్ఠంగా ఉండాలి. చేసేది అంతా నటన అనియే అనుకుంటూ ఉండాలి. నటనలో లోపం జరిగినా గందరగోళం తప్పదు. అదే నిజం అనుకున్నా గందరగోళం తప్పదు. కాబట్టి పాటించడములో లోపం రాకూడదు. దానిని నిజం అనుకోకూడదు. అందువలన జరిగేది ఏమిటి అని ప్రశ్న. నటుడైనవాడు నటించి సంపాదించిన డబ్బు వాని గృహనిర్వహణంలోనే వ్యయం అవుతుంది. అలాగే మీరు ఏకాంతంలో కూర్చుండి భగవధ్యానం, భజనం చేస్తున్నారు అనుకోండి! అది నటనం కాని కార్యక్రమం. దీనిని పదుగురు చూచి మెచ్చుకోనక్కరలేదు కదా! ఇది కేవలం మీరు మీదేవుని ఉపాసించుకోవడమే అవుతుంది. గృహస్థులై పని చేస్తున్నారనుకోండి! అది నటన. మీరు సంసారనాటకంలో నటిస్తున్నారు అన్నమాట. మొత్తం మీద దానికీ దీనికీ లక్ష్యం ఒక్కటే. అది భగవద్భజనం. ఇందువలన నటనపూర్వకంగా సాధన చేసేవాడు భగవన్మార్గంలోని వాడే అవుతాడు. భజనము అఖండముగా సాగుతుంది. అలాకాక ఇక్కడ కొంతతడవు భగవద్ధ్యానభజనాదికం, కీర్తనసత్సంగాదికం నిర్వర్తించి అక్కడ లౌకికవ్యాపార వ్యవహారాదులనే మన పనిగా పెట్టుకుంటే సాధన అఖండం కాదు. ఏపని చేసినా భగవానునిదిగా భావన కావాలి.

"తదర్థం కర్మ కౌంతేయ ।" (గీత. 3/9)
"మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి" (గీత. 12/10)

మనం కర్మ భగవానునికోసమే చేయాలి. భగవానుని కర్మనే చేయాలి. అలా చేస్తుంటే ఎల్లవంకల ఎల్లవేళలా భజనం సాగుతుంది. కర్మను విడిచిపెట్టినవెంటనే మనస్సు ఆ భగవంతుని మీదనే లగ్నం అవుతుంది. అది ఎలాగంటే మనం ధనార్జన నిమిత్తం వ్యాపారం చేస్తాము. దుకాణం కట్టేసిన వెంటనే రూపాయల చింతనం మొదలు అవుతుంది. ఎన్ని రూపాయలు వచ్చినవి? అన్న విచారణ మొదలవుతుంది. దుకాణం మూసివేయబడుతుంది. బజారు బందయిపోతుంది. అయినా మనం దీపం వెలిగించుకుని కూర్చుండి లెక్కలు చూచుకోవడం కొనసాగిస్తాం. టోటలు చేసి చూసుకోవడం ఎందుకయ్యా అంటే వ్యాపారం చేయడం ఎందుకు ఇందుకే కదా? అంటాము. అంటే మనం ఎందుకోసం పనిచేశామో దానిమీదనే మనస్సు లగ్నం అవుతుంది. అలాగే గృహస్థవిధులను మనమెందుకు పాటించాము? భగవత్ప్రాప్తికోసం. కర్మను మానివేయుటతో మనస్సు భగవానుని మీద లగ్నం అయిపోతుంది. వ్యాపారాన్ని ఆరంభించినప్పుడు ధనాన్ని ఉత్పత్తి చేయడం ఎలాగ అనే విషయాన్ని మనం దృష్టిలో ఉంచుకుంటాము. ధనం విషయం మనకు జ్ఞాపకం ఉండవచ్చును. ఉండకపోవచ్చును. కాని పని మాత్రం ధనము కోసమే అనే దృక్పథం కలిగి ఉంటాము. కాబట్టి మనకు రూపాయలకు (ధనము) సంబంధించిన అఖండస్మరణం ఉంటుంది. రూపాయలే మనకు అఖండధ్యేయాలు అవుతాయి. ఆ విధంగానే భగవానుని కోసమే భజనము, ధ్యానము అయినప్పుడు భగవానునికోసమే గృహస్థాశ్రమ పాలనము అయినప్పుడు అన్ని పనులయందూ అఖండత్వం ఉంటుంది. ఈ అఖండత్వాన్ని పట్టుకున్నవాడు సాధకుడు అవుతాడు. అఖండత్వాన్ని నిలుపుకోవడమే 'సాధన' అవుతుంది. దానివలన అఖండమైనది ప్రాప్తించుటయే సాధ్యం అవుతుంది. అటుపిమ్మట వానియంతట అవే సాగిపోతాయి.

ఈ విధముగా ఇక్కడ 'మనం భగవానుని వారము' అని అనుకోవడం ఎలాగ? అఖండసాధన ఎలా ఉంటుంది? అనే రెండు ప్రశ్నలకు సమాధానాలు చెప్పడం అయినది.

~~~~oOo~~~~
~~~~

# 6. అందరకు శుభమెట్లు చేకూరుతుంది?

అందరకు శుభమెలా చేకూరుతుందన్నది ఒక ప్రశ్న. దీనికి సమాధానం చెపుతున్నాను. సావధానంగా హృదయంగమం చేసుకోండి. ముందుగా మనం మనలను ఉద్ధరించుకోవాలనే ప్రబలమైన ఉద్దేశ్యం మనలో ఏర్పడి ఉండాలి. అది ఒకటే మన కోరిక, అపేక్ష, లక్ష్యం కావాలి. అది ఒక్కటే మన ఆవశ్యకత కావాలి. ఒక సూక్తియున్నది-

"ఏకై సాధే సబ సధై, సబ సాధే సబ జాయ।"

"ఒక్కటి సాధిస్తే అన్నీ సమకూరుతాయి అన్నీ సాధించాలని చూస్తే ఒక్కటీ లభించదు". కాబట్టి ముందుగా మనం మన చిత్తవృత్తులనన్ని వైపులనుండి తొలగించుకొని ఆత్మకల్యాణమనే అంశం మీద లగ్నం చేయాలి. అటుపై ఆ లక్ష్యం సిద్ధించడం కోసం నిరంతరసాధన సాగించాలి. ఆ నిరంతరత్వాన్ని గురించి మనం విచారణ చేయాలి.

వృత్తి వ్యాపారాలు, సమయం, వ్యక్తి, వస్తువు మొదలైనవి మన ముందుకు వస్తుంటాయి. అనగా రకరకాల వృత్తివ్యాపారాలు కర్తవ్యాలరూపములో మనముందుకు వస్తుంటాయి. మన ముందు సమయం ఉంది. అంటే రాత్రి, పగలు, మాసము, సంవత్సరము రూపంలో ఆయువు నిలిచి ఉన్నది. తల్లిదండ్రులు, భార్యాబిడ్డలు, కుటుంబసభ్యులు మొదలైన వ్యక్తులు మనకు ముందు ఉన్నారు. నాలుగవ అంశంగా ఇల్లు, ధనము మొదలైన వస్తువులున్నాయి. వీనికోసం మనం వేరువేరుగా పనులు చేయాలి. అనగా సత్సంగ సమయమయితే సత్సంగంలో పాల్గొనాలి. భోజన సమయమయితే భోజనము చేయాలి. విశ్రాంతి సమయమయితే విశ్రాంతి తీసుకోవాలి. గ్రంథపఠన సమయమయితే గ్రంథపఠనం చేయాలి. ఇలాగే ఇంకా జీవికానిర్వహణకార్యము, వంట చేసుకోవడము, పిల్లల సంరక్షణకార్యము, నిద్రపోవలసిన పని, శరీరశుద్ధికై గంగాస్నానము మొదలైన పనులెన్నో మనం చేయవలసినవి ఉన్నాయి. ఈ విధముగా వేరువేరు పనులు,

బాధ్యతలు మనముందుకి వస్తుంటాయి. ఒక్కసారిగా కాక వేరువేరు సమయాలలో వస్తుంటాయి. కాబట్టి పనులు విభజింపబడడం ఉంటుంది. సమయం విభజింపబడడం ఉంటుంది. అలాగే వీరు మనవారు, వీరు మనవారు కారు. ఇవి మనవి, ఇవి మనవి కావు. వ్యక్తులకు, వస్తువులకు కూడ విభజనముంటుంది. ఇలా విడివిడిగా ఉన్నవానిని అన్నింటిని ఏకం చేయడం మనకు సాధ్యముకాదు. అలా చేయడం మంచిదికాదు. అలాంటప్పుడు ఒక్క లక్ష్యం, ఒక్క ఉద్దేశ్యం ఎలా కుదురుతుంది? అన్నది ప్రశ్న. మనం విచారణద్వారా ఈ భిన్నత్వాన్ని తొలగించుకోవాలి. అది ఎలా సాధ్యమవుతుంది? వస్తువులు, వ్యక్తులు, సమయాలు, ఉపయోగాలు వేరువేరుగా ఉన్నాయి. పనిపాటలు వేరువేరుగానే ఉన్నాయి. అలా ఉండవలసిందే. అలా ఉండడం అన్యాయం ఏమికాదు. అలాంటప్పుడు మనం ఒక్కదానికై సాధన చేయడం ఎలాగ? అన్నది ప్రశ్న. మనకు ఒక ఉద్దేశ్యం ఉంది. అందుచేతనే ఇన్ని వస్తువులు మన ముందుకి వస్తున్నాయి. మనం కుటుంబపోషణంకోసం డబ్బు గడించాలి. కుటుంబసభ్యులకోసం కావలసిన వస్తువులు తేవాలి. అవసరం అనిపించినప్పుడు విశ్రాంతి తీసుకోవాలి. నిద్రకు పూనుకోవాలి. అపేక్షితం అయినప్పుడు భోజనము చేయాలి, ఇవన్నీ వేరువేరుగా చేయబడే పనులు. అలాంటప్పుడు ఒక్క ఉద్దేశ్యం ఎలా కుదురుతుంది? అన్న ప్రశ్న ఉదయిస్తుంది.

ఇందులో ముఖ్యంగా గమనించవలసిన విషయం ఒకటుంది. మనం ఇన్ని వేరువేరు పనులు దేనికొరకు చేస్తున్నాము? ఆ 'కొరకు'లు అంటే ఉద్దేశ్యాలు మనకు అనేకములు ఏర్పడుతున్నాయి. మనం వానిలో చిక్కుకుపోతున్నాము. మన ఉద్దేశ్యం ఒకప్పుడు విద్యకాగా మరియొకప్పుడు కీర్తి అవుతుంది. ఒకప్పుడు ధనసంపాదనం మన లక్ష్యమయితే వేరొకప్పుడు పేరుప్రతిష్ఠల సాధనో, లేక ఆరోగ్యసిద్ధియో లక్ష్యం అవుతున్నది ఒకప్పుడు భగవత్ప్రాప్తి ఉద్దేశ్యంకాగా మరియొకప్పుడు భజనధ్యానాదులు ఉద్దిష్టములు అవుతున్నాయి. ఇలా విభిన్నలక్ష్యాలతో ప్రవర్తిస్తుంటే మనం సాధన చేయలేము. "సబ్ సాధే సబ్ జాయ్" అనగా అన్ని సాధించాలని చూస్తే ఒక్కటీలభించదు. ఏ లక్ష్యము నెరవేరదు. కాబట్టి మన భావన ఒక్కటిగా ఉండాలి. "మేము అన్ని పనులు

చేస్తాము ఒక్క భగవానుని ప్రసన్నతను కోరి" అనే భావన కావాలి. నిద్రపోయి మేల్కొన్నప్పుడు, ఇప్పుడు మనం ఏమిచెయ్యాలి అని ఆలోచించుకోవాలి. భగవదాజ్ఞాపాలనం చేయాలి. భగవానునికోసమే చేయాలి. భగవానుని కార్యమునే చేయుచున్నామని అనుకోవాలి. మీరు ముఖప్రక్షాళనం చేసుకుంటున్నారు అనుకోండి, అదికూడ భగవానుని పనియే అనే అనుభవం కావాలి. మా ముఖం మేము శుభ్రం చేసుకొంటు, మా చేతులు మేము శుభ్రం చేసుకుంటు అది భగవానుని కార్యమని అనుకోవడం ఎలాగ? అని అంటారు మీరు. అలా అయితే మిమ్ము మీరు వేరుగా భావించుకొన్నవారు అయినారు. కాని భగవానుని వారుగా భావించుకొన్నవారు కాలేదు. మీ ప్రవృత్తి యీ విధముగా ఉంటే ఉద్దేశ్యం సిద్ధించదు. మరి ఏమవుతుంది? బంధనం అవుతుంది. ఇంకేమి అవుతుంది? ఇంతవరకు ఏది అవుతూ వచ్చిందో అదే అవుతుంది. అయితే యీ శరీరము భగవానునిది అని అనుకోవడం ఎలాగ? అన్నది ప్రశ్న. దీనికి సమాధానం ఇది. మనం భగవానుని పొందగోరుతూ ఉన్నప్పుడు, మనం భగవానునివారము అయినప్పుడు మన ఈ శరీరం కూడ భగవానునిదే అవుతుంది. మనం చేతులు కడుగుకోనేటప్పుడు భగవానుని అనంతసృష్టిలో ఆ చేతులుకూడ ఒక చిన్న అంశమే అనుకోవాలి. అతి చిన్న యిసుకరేణువు కూడ ఈ భూమికంటె భిన్నమైనది ఎట్లు కాదో అలాగే యీ శరీరంకూడ ఈ అనంతబ్రహ్మాండంలోని ఒక అతి చిన్న అంశం. ఇది కూడ భగవానునిదే. కాబట్టి మనం ముఖం కడుగుకొంటున్నామంటే భగవానుని పని చేస్తున్నామని, చేతులు శుభ్రము చేసుకొంటున్నామంటే భగవానుని పనినే చేస్తున్నామని మనం అనుకోవాలి. నేను బహు మహత్త్వపూర్ణమయిన విషయం చెపుతున్నాను. ఇది వినోదంగాను, పరిహాసంగాను చెపుతున్నమాట కాదు. కడకు మలమూత్రవిసర్జనం చేస్తున్నా ఆ భావనే మనలో పని చేయాలి. ఈ విధమైన చిత్తవృత్తి సహజంగా లోపలనుండి రావాలి. ఈ శరీరము భగవానునిదే అయినప్పుడు దానిని శుభ్రపరచడం భగవానునకు సంబంధించిన పనికాదా? మనం ఒక ఇంటిలోని మలాన్ని తొలగిస్తున్నాం (పాకీపని) అంటే అది ఆ ఇంటివానికి సంబంధించిన పనినే మనం చేస్తున్నామన్నమాట. ఆ ఇంటిలో చీపురుపెట్టి చిమ్ముతున్నామంటే ఆ ఇంటివాని పనినే మనం చేస్తున్నామన్నమాట.

అలాగే యీ శరీరం భగవానునిది అయినప్పుడు దీనితో మలమూత్రవిసర్జన చేసి దీనిని శుభ్రపరచడం కూడ భగవానుని పనినే మనం చేయడం అవుతుంది. అలాగే స్నానం చేస్తున్నామంటే అది కూడ భగవానుని కార్యమే అవుతుంది. బట్టలు ఉతుకుతున్నామంటే అదీ భగవత్కార్యమే. వంట చేస్తున్నామంటే అదీ భగవత్కార్యమే. భోజనం చేస్తున్నామంటే అదీ భగవత్కార్యమే. మనం చేసే పనులలో ఏదికూడ భగవానునికి చెందనిది ఉండదు. ఇప్పటివరకు మనకట్టి అనుభవము, భావనకలిగియుండకపోతే యిప్పటినుండైన మనం చేసే ప్రతిపనికూడ భగవానుని పని అనియే భావించుకోవడం ప్రారంభించాలి.

అన్నిపనులు ఎలా భగవానునివో అలాగే అన్ని సమయాలుకూడ భగవానునివే. ఇది భగవద్భజన చేసుకునే సమయం. ఇది పనిపాటలు చేసుకునే సమయం అంటూ మనం సమయాన్ని విభజించనక్కరలేదు. భగవద్భజనమనే పని భగవానునిదే. వంటచేసుకునే పని భగవానునకు సంబంధించినదే. ఇలా అన్ని పనులూ భగవానునివే అయినప్పుడు వానికోసం వినియోగింపబడే సమయమంతాకూడ భగవానునిదే అవుతుంది. కాబట్టి కాలానికీ విభాగంలేదు. సమయానికీ విభాగంలేదు. సాధకుడు ఇది భజన చేసుకునే సమయం. ఇది కాదు అంటూ ఎన్నడు సమయవిభాగం చేయకూడదు. అయితే ఈ భిన్నత్వం ఎక్కడ ఉన్నది? అంటే భగవానుని భజించే విధములలో ఉంది. ఎలాగంటే ఒకప్పుడు నామజపము ధ్యానముల రూపంలో భగవద్భజన చేస్తే మరియొకప్పుడు వంటరూపంలో భగవద్భజన చేస్తున్నాం అన్నమాట. బాగా ఆలోచించండి భజన అనేది దేనికి పేరు? సేవకుపేరు. కాబట్టి భగవానుని కోసము చేసే ప్రతిపనీ భజనమే అవుతుంది. ఇప్పుడు భోజనం చేయడము భగవద్భజనమే. దాని సమయమూ భగవానునిదే. కాబట్టి భోజనం చేసే సమయం భగవానునిది కాదు అని అనుకోకూడదు. అలాగే పనిపాటలు చేసుకొనేటప్పుడు ఆ పనులన్నీ భగవానునివే అన్న అనుభవం కలిగితే వానికై వినియోగింపబడే సమయమంతా భగవానునిదే అవుతుంది.

మనం నిద్రిస్తున్నామంటే ఆ నిద్రకూడ భగవత్కార్యమేనా? దానికై వినియోగింపబడిన సమయంకూడ భగవానునిదేనా? అని మీరు అనవచ్చును. అవశ్యమూ భగవానునిదే. అది ఎలాగంటారా?

నిద్రపోయేవేళ ఒక్క విషయం మీరు దృష్టిలో ఉంచుకోవాలి. ఇది చాల ముఖ్యమైనది. అదేమంటే మనం నిద్రకోసమే నిద్రపోవాలి. కాని విశ్రాంతిని, సుఖమును అపేక్షించి నిద్రపోకూడదు. అయితే ఎందుకు నిద్రపోవాలి? ఆ నిద్రకోసమే నిద్రపోవడమెలాగన్నది ప్రశ్న. ఇంతసేపు మీరు కూర్చుండియో, ఇటుఅటు తిరుగాడుతూనో భగవానుని పని చేస్తున్నారు. ఇప్పుడు అయిదు, ఆరు గంటలు పరుండి భగవద్భజనం చేయాలి. ఎందుచేతనంటే ఈ శరీరం భగవానునిది. దీనిని కొంత తడవు ఇటుఅటు తిరుగాడేటట్లు చేయాలి. కొంతసేపు పనిపాటలు చేసేటట్లు చేయాలి. కొంతసేపు పొడవుగా దేనిమీదనైనపడి (అస్తరణము) పరుండేటట్లు చేయాలి, ఇదంతా భగవానుని పని అనే భావనతోటే చేయాలి. నిద్రారూపములో భగవద్భజన చేస్తున్నాం. విశ్రాంతికోసం సుఖంకోసం కాదనే భావనతో నిద్రపోవాలి. పరున్న తరువాత నిద్రరానంతవరకు భగవచ్చింతనం చేసుకుంటూనే ఉండాలి. భగవానుని దయాదృష్టి మనమీద ఉన్నది. ఆ స్వామియొక్క అభయహస్తాలు మనపై నిలిచివున్నాయనే అనుభవం మనలో ఉండాలి. ఎలాగంటే పిల్లవాడు తల్లి ఒడిలో ఉన్నా ఆమె కృపాదృష్టి వానిమీద ఉన్నట్లే. పాదాలమీద ఉన్నా ఆమె కృపాదృష్టి వానిమీద ఉన్నట్లే. అలాగే నేను భగవానుని పాదాలమీద ఉన్నాను. ఆ స్వామికి నా మీద దయ ఉంది. ఆ స్వామి నన్ను దయాదృష్టితో చూస్తున్నాడు. ఆ స్వామి అభయహస్తం నా తలమీద నిమురుతున్నది. అని యీ విధంగా చింతనం చేస్తూ ఆ స్వామి నామాన్ని స్మరించుకుంటూ ఉండాలి. అలా చేసినప్పుడు మనం పరున్న సమయంలో భగవద్భజన చేసినట్లు అవుతుంది. అలా చేస్తుండగా నిద్రవస్తే వస్తుంది. నిద్రపోవాలనే చింత మీకులేదు. నిద్రరాదు. మీ లక్ష్యం నిద్రపోవడం కాక భగవానుని చరణాలమీద పడియుండడం కదా! మనం భగవానునివారం. మనకు నిద్రవస్తే నిద్రారూపంలో భగవానుని పని చేస్తున్నవారమవుతాము. నిద్ర రాకపోతే భగవచ్చింతనం చేసుకున్నవారమవుతాము.

ఈ విధముగా భావనచేస్తే పనిపాటలన్నీ భగవానునివే అవుతాయి. సమయమంతా భగవానునిదే అవుతుంది. ఇక వ్యక్తుల విషయం ఉంది. మనకున్న అన్నదమ్ములు, తల్లిదండ్రులు, కుటుంబసభ్యులు, బంధుగులు, ఆప్తజనులు వీరందరు వ్యక్తులు. వీరు కూడ భగవానునివారే. వీరందరూ

భగవానునివారయితే వీరికి సేవ చేయడమెలాగ? ఒక ఉత్తమురాలైన కోడలు తన అత్తను ఎలాసేవిస్తుందో అలాగ. అట్లే అత్తకూడ తన కోడలికోసం తన కర్తవ్యాన్ని నిర్వర్తించడమే ప్రధానలక్ష్యంగా పెట్టుకోవాలి. అంటే కోడలికి సుఖం కలిగించడం అత్తకు ప్రధానోద్దేశ్యం కావాలి. కాని ఆమెవలన సేవలను, సుఖాలను తాను అందుకోవడం కాకూడదు. అలాగే నిద్రపోవడంలో లేదా పరుండడంలో మనం సుఖం పొందడం కాదు మనకు లక్ష్యం. ఒక అత్త తాను సుఖమును పొందక కోడలికి ఎలా కలిగించడమన్నది ప్రశ్న. ఈ సందర్భంలో సీతను, కౌసల్యను గుర్తుకు తెచ్చుకోండి. కౌసల్య ఏమంటుంది? "దీపపు వత్తిని సరిచేయుమని కూడ నేనెన్నడు సీతకు పని చెప్పలేదు" అని అంటుంది. సీత యేమంటుంది? అత్తా! మీకు తగినవిధముగా సేవ చేయలేకపోయాను. దురదృష్టవంతురాలను అంటుంది. ఇద్దరు ఒకరికి సుఖం కలిగించలేకపోయామని మరియొకరు బాధపడేవారే అయ్యారు. అత్త తనను సుఖపెట్టలేదన్న చింత ఇక్కడ కోడలికి లేదు. కోడలు నాకు పరిచర్యలు చేయలేదన్న విచారము అత్తకులేదు. ఆ విధముగానే మనం ప్రతిపనిని ప్రభువుయొక్క (భగవానుని) కార్యముగా భావించాలి. స్వయంగా సుఖం పొందడం లక్ష్యంగా కాక, వ్యక్తులకు సుఖంకలిగించడమే మనం లక్ష్యంగా పెట్టుకోవాలి. వారిని సేవించాలి. సంతోషపెట్టాలి. వారి హితంకోసం పాటుపడాలి. వారికి మనం అనుకూలురం కావాలని అనుకోవాలి. అందుకు ప్రయత్నించాలి.

ఈ విధముగానే కుటుంబసభ్యులు ఎందరుంటే అందరు భగవానునివారే. అయినా వారిలో మనకు రెండు విభాగాలు కానవస్తాయి. 1. మన కుటుంబము, మన సంప్రదాయములకు చెందినవారు. 2. మన కుటుంబానికి, సంప్రదాయానికి చెందనివారు. మనకుటుంబమువారు అంటే ఈ కుటుంబానికి సేవ చేయడం ప్రథమకర్తవ్యం పరమధర్మం అన్నమాట, నేను ఈ మన కుటుంబానికి ఋణపడి ఉన్నాను. దానిని ముందుగా తీర్చుకోవాలని అర్థం అన్నమాట. మన కుటుంబానికి చెందనివారికి కూడ అప్పుడప్పుడు సేవాసహకారాలు అందిస్తూనే ఉండాలి. అంటే వారికి సేవ చేయవలసిన అవశ్యకత ఎక్కువగా ఉన్నప్పుడు ఎలాగో కొంత సమయం మిగుల్చుకుని వారికి సేవలు అందించాలి అని భావం, అయితే సేవ

ఎందుకు చేయాలి? భగవానుని ప్రసన్నతకోసం. ఎందుచేత? వారు భగవానునివారు కాబట్టి. వీరు మా కుటుంబమువారు అని అనడంలో వీరికి విశేషంగా సేవలు అందించాలి. "వీరు మాసేవలను విశేషంగా కోరుతున్నారు" అని భావం. కాబట్టి సేవలు వారికి ముందుగా చేయడం, విశేషంగా చేయడం మనకు కర్తవ్యం అవుతుంది. కాని యిక్కడ గుర్తుంచుకోవలసిన విషయమేమంటే వారిని భగవానునివారు అనియే అనుకోవాలి. కాని నావారు అని మమతాబంధాన్ని ఏర్పరచుకోకూడదు. వారియందు మనకు గోచరించే మమత్వం యొక్క ఉద్దేశ్యం వారికి సుఖం కలిగించాలన్నది మాత్రమే. అందుకే వారు మన కుటుంబమువారయ్యారు. అనే యీ భావన మనలో ఎల్లప్పుడు జాగృతమై ఉండాలి.

ఇక మిగిలియున్నది వస్తువుల విషయము. వస్తువుల ఉపయోగం భిన్నభిన్నంగా ఉంటుంది. భోజనపాత్ర, గ్లాసుల ఉపయోగంవేరు. వ్రాసుకునే కలంయొక్క ఉపయోగంవేరు. వేరువేరు వస్తువులు వేరువేరు పనులకు ఉపయోగపడుతుంటాయి. ఈ వేరువేరు ఉపయోగాలు ఎందుకు? భగవానుని ప్రసన్నత కొరకే, వీనిని భగవానుని సేవకు వినియోగించాలి. వీనిలో ఇవి నావి, ఇవి నావికానివి అను విభాగంలేదు. అయినా మావి లేక మానవి అని అనుకోవడంలో ఉద్దేశ్యం వానిని ముందుగా వినియోగిస్తాము అని మాత్రమే. ఈ విధముగా ఈ వస్తువులతో భగవానునకు, భగవానుని జనులకు సేవ చేస్తుండాలి.

ఇంతకు సారాంశమేమంటే ఏ పనీ భగవానునిది కానిదిలేదు. ఏ క్షణము భగవానునిది కానిదిలేదు. ఏ వ్యక్తీ భగవానునివాడు కానివాడులేడు. ఏ వస్తువు భగవానునిది కానిది లేదు. ఇప్పుడు మీరే చెప్పండి! సర్వము భగవద్భజనము కాక మరి యేమైనది? సహజంగా నిరంతరభజనము నిరంతరసాధన సాగినట్లయినది.

"తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ" (గీత. 8–7) "సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ" ఇక్కడ 'యుధ్య చ' అని అనడంలోని ఆంతర్యం ఏమిటంటే "అడుగు అడుగునా అవసరమయిన పనియేది వచ్చిపడినను దానిని నిర్వర్తించు" కాని ఆ నిర్వర్తించడం భగవానుని ఆజ్ఞానుసారమని, భగవానుని ప్రసన్నతకోసమని భావిస్తూచేయాలి. యుద్ధంలో అర్జునుడు ఏమి చేశాడు? అతడు కర్ణుని

సంహరించబోతుంటే "అర్జునా! ఇది అన్యాయం" అన్నాడు కర్ణుడు. "అర్జునా! కర్ణుని మీద బాణప్రయోగం చెయ్యి" అన్నాడు భగవానుడు. ఇక మేము న్యాయాన్యాయాలను చూడనక్కరలేదు. భగవదాజ్ఞను పాలించడమే నాపని. బాణప్రయోగం చెయ్యమని భగవానుని ఆజ్ఞ కూడ అయినది అన్నాడు అర్జునుడు.

భగవానుడు అర్జునుని ముందు ఉన్నట్లుగా ప్రత్యక్షంగా మన ముందు లేడుగదా! అని అనవచ్చును. భగవానుడు లేకుంటే ఏమి? భగవద్గీత రూపంలో అతని వాక్కు ఉండనే ఉంది. ఇలాంటి పని ఇతరుల మన్నలను ఉద్దేశించి చేయడాన్ని మనం వాంఛిస్తామా? అని మనం మన హృదయాన్ని కూడ తడిమి చూచుకుంటుండాలి. మన విషయంలో ఇతరులు ఎలా చేయడాన్ని మనం వాంఛించమో అలా ఇతరుల విషయంలో మనమూ చేయకూడదు. గీతోపదేశరూపంలో భగవదాజ్ఞయే ఉన్నదికదా! ఇక న్యాయాన్యాయ విచక్షణంతో మనకు పనిలేదు. ప్రత్యక్షముగా భగవానుడన్న ఏమి? అతని ఆజ్ఞరూపంలో గీతాదిగ్రంథాలు ఉండనే ఉన్నాయి. భగవదాజ్ఞలను వానిలో చూచుకుంటూ తదనుసారంగా న్యాయమైన పని చేస్తుండాలి. అన్యాయం చేయరాదు. ఆ గ్రంథాల పరిజ్ఞానం లేకపోతే కలుగజేసుకో! అయినా భగవదాజ్ఞాస్వరూపం అవగాహనకు రాకపోతే నీకు ఒక హృదయం ఉన్నది కదా! దానిని విశుద్ధంగా నిలుపుకో! అప్పుడు నీకే అర్థమవుతుంది.

ఒక బాబాజీ ఉన్నాడు. పడవపై కూర్చుండి ఎక్కడకో వెళుతున్నాడు. ఆ పడవలో ఇంకా చాలామంది జనులున్నారు. విధివశమున పడవ ప్రవాహమధ్యానికి చేరింది. ప్రవాహ వేగానికి లోబడి ఒకదిక్కుగా కొట్టుకుపోవడం మొదలుపెట్టింది. "అయ్యలారా! మీమీ ఇష్టదైవతాలను స్మరించుకోండి! పడవ అదుపుతప్పింది. ప్రవాహంలో వడి ఎక్కువగా ఉంది. ముందు సుడిగుండం ఉంది. బహుశా మునిగిపోవచ్చును. దేవుని తలచుకోండి!" అని పడవవాడు హెచ్చరించాడు. ఆ మాటవిని అందరూ ఏడవడం, భగవానుని వేడుకోవడం ఆరంభించారు. వారికి చేరువగా బాబాజీ ఉన్నాడు. ఆయనకు చేరువగా కమండలం ఉంది. ఆయన "జయ జయ సీతారాం, జయజయ సీతారాం" అంటు బిగ్గరగా నామస్మరణం చేస్తు కమండలంతో ప్రవాహపు నీటిని

ముంచి పడవలో పోయడం మొదలుపెట్టాడు. అదేమిపని? అన్నారు జనులు. వారి మాటను అతడు చెవినపెట్టలేదు. అతడు నదిలోని నీటిని పడవలో పోస్తూనే ఉన్నాడు. "జయజయ సీతారాం" అంటూనే ఉన్నాడు. కొలది క్షణాలలోనే పడవ ప్రమాదస్థాయిని దాటి సరియైన ప్రవాహంలోనికి చేరి పడవ వాని అదుపులోనికి వచ్చినది. ఇక భయపడ నక్కరలేదు గండం గడిచింది. దరికి చేరుతున్నాం అని సూచించాడు పడవవాడు. ఆమాట విని బాబాజీ! పడవలో పోసిన నీటిని ఎత్తి మరల నదిలోపోయడం మొదలుపెట్టాడు. నోటితో "జయజయ సీతారాం" అని అంటూనే ఉన్నాడు. ఇలాంటి పిచ్చిపిచ్చి పనులు చేస్తున్నావేమయ్యా? నీకు పిచ్చి యెత్తినదా? సాధువేషం కూడ వేసినావు. మూర్ఖునిలాగ ప్రవర్తిస్తున్నావు ఏమయ్యా? మేమందరము మునిగిపోతే ఏమయ్యేది? నీకు జాలిలేదా అని పడవలోనివారు బాబాజీని పరుషవచనములు ఆడినారు. అప్పుడు ఆ బాబాజీ ఇలా అన్నాడు – "నాయనలారా! నేను మీకంటే వేరుగా ఉంటే కదా మీమీద నాకు జాలికలగడం? నేను సాధువునే. మూర్ఖునివలె ఎందుకు ప్రవర్తిస్తాను?

అలా అయితే పడవ కొట్టుకుపోతున్నప్పుడు బయటి నీరు పడవలో ఎందుకుపోశావు? సుడిగుండపు గండం గడిచాక పడవలోనినీటిని బయట ఎందుకు పోశావు? ఇది విరుద్ధపు పనికాదా? అని ప్రశ్నించారు జనులు. నేను చేసిన పని సవ్యమైనదే. విరుద్ధమెట్లు అయినది? అన్నాడు బాబాజీ. సవ్యమైన పని ఎలా అయినది? అన్నారు జనులు. ఈ పని సవ్యమెలా అయిందో చెపుతున్నాను వినండి – భగవానుని సంకల్పమెట్టిదో మనం ఎరుగము. ఈ పడవను నీటిలో ముంచడమే భగవానుని సంకల్పమని భావించి ఆయన సంకల్పానికి మనం కూడ సహకరించాలన్న భావనతో నేను బయటి నీటిని పడవలోపోసితిని. పడవ సుడిగుండపు పరిధిని దాటిపోవడంతో దీనిని ముంచివేయడం భగవానుని ధ్యేయం కాదని తెలిసికొని ఆయన సంకల్పానికి అనుగుణంగా ప్రవర్తించాలన్న భావనతో పడవలోని నీటిని బయటపోసితిని. భగవానుని సంకల్పానికి అనుగుణముగా ప్రవర్తించడమే సాధువుయొక్క ధర్మం. నాయనలారా!" అని బాబాజీ వారికి బదులు చెప్పినాడు. మనం సాధువులం కాని, సాధుప్రవృత్తి కలవారంకాని అయినప్పుడు బ్రతుకుతామా? లేక చస్తామా? అన్న చింత

మనలో ఉండరాదు. భగవానుని ఇచ్ఛతో మన ఇచ్ఛను మేళవించడమే మనం చేయవలసిన పని. భగవానుని సంకల్పమెట్టిదో ముందుగా మనకు తెలియదు. ఇది భగవానుని వినోదచర్య. పడవను ముంచివేయడం ఆయన సంకల్పంకాదన్న విషయం ముందుగా తెలిసి ఉంటే బయటి నీటిని అందులో పోయడం జరిగేది కాదు. అయితే ఆ విషయం ముందు తెలియలేదు. అందుచేత పడవను ముంచివేయడమే భగవానుని లక్ష్యమని అనుకోవలసివచ్చినది.

ఇది శరణాగతభక్తుని లక్షణం. ఇలా ఎవరో మహానుభావులైన సాధువులు చేశారు. కాని పడవ మునిగిపోతున్నప్పుడు మీరు మాత్రం అలా నీరు నింపవలదు సుమా! ఏడవనూ వలదు. బాగుంది సంతోషం. ఆనందకరమైన విషయం. ఇందులో కూడ ఏదో శుభం దాగిందని మాత్రమే అనుకుంటుండండి. ఇలాంటిదే మేము ఇంకొక విషయం కూడ వినియున్నాము. అది ఏమంటే? సాధువులకు సంబంధించిన ఒక ఆశ్రమం ఉంది. దానికి సంబంధించిన యీ కథను నేను చాల ఏండ్లకు ముందు వినియున్నాను. ఆ ఆశ్రమం యొక్క అధిపతి బహు ఉత్తముడు, పండితుడు, గొప్ప భగవద్భక్తుడు. ఒక మారు గంగానదికి పెద్ద వరద వెల్లువ వచ్చింది. కొండ దగ్గరనుండి మహావేగంగా నీటి వెల్లువ ముందుకు చొచ్చుకొని వచ్చినది. దానికి సంబంధించిన ఒక పాయ ఆశ్రమాన్ని చుట్టుముట్టింది. ఆశ్రమగృహాన్ని పెకలించి పట్టుకుపోతుందని అనిపిస్తున్నది ఆ ప్రవాహం. ఆ పరిస్థితిని చూచి అప్పటి మఠాధిపతి (ఆయన పేరు గుర్తులేదు) చాల సంతోషపడిపోయాడు. ఆనందంతో అమ్మ ఒడిలోనికి వెళ్ళిపోతున్నాం (గంగామాత ఒడిలోనికి అన్నమాట) అంటూ హర్షము నందెను. అయ్యో! ఇల్లు ప్రవాహంలో కొట్టుకుపోతుంది. ఇప్పుడు ఎలాగురా? దైవమా! అని మిగిలినవారందరు ఎంతో అరాటపడిపోతున్నారు. మఠాధిపతి మాత్రం సంబరపడిపోతున్నాడు. అంతట ఏమి జరిగిందనుకున్నారు? ప్రవాహవేగంలో పెద్దపెద్ద రాళ్లు కొట్టుకుని దొర్లుకుంటు వచ్చి ఆశ్రమంప్రక్క పెద్ద మేటగాను, గుట్టగాను నిలిచిపోయాయి. అప్పుడు ప్రవాహం ఆ రాళ్ల మూలంగా ఆశ్రమాన్ని తాకకుండా ప్రక్కనుండి ముందునకు సాగిపోయినది. ఆశ్రమం సురక్షితం అయింది. అమ్మ ఒడిలోనికి పోతున్నామని అందులోని సాధువనుకున్నాడు.

అమ్మ ఒడిలోనికి చేరిన పిల్లవానికి సుఖం కలుగుతుందా? దుఃఖం కలుగుతుందా? మీరే ఆలోచించండి. సుఖమే కదా! ఆ సుఖమే అచ్చటి సాధువునకు కలిగినది? వారందరూ మునిగిపోతారన్నది ప్రత్యక్షంగా గోచరించే విషయం. ప్రవాహం పెరుగుతున్నకొలది ఆ సాధువు సంతోషం కూడ పెరిగిపోయింది. దీని సారాంశమేమిటంటే ప్రతిపని భగవానుని ఆజ్ఞగా భావించుకొని, ఆ స్వామియొక్క సంకేతానుసారమే చేయాలి. ఏది ఎలా జరిగినా అనుక్షణము ప్రసన్నతనే పొందుతుండాలి. సుఖం కలిగినా, దుఃఖం కలిగినా ఏ సంఘటన ఎలా జరిగినా సంతోషమునే పొందుతుండాలి. కారణమేమంటే జరిగేదంతా భగవానుని చేతిలోనిది. చేయడమనేదంతా మన చేతులలోనిది. కాబట్టి చేసేది ప్రతిది భగవదాజ్ఞానుసారమే చేయాలి. పరిణామం ఏది ప్రాప్తించినా మేలు! మేలు! భళిభళీ! భగవానుని కృప అనుకుంటు సంతోషానుభూతినే పొందుతుండాలి. జరుగుతున్నదేదో అది సవ్యంగా ఉందా? అపసవ్యంగా ఉందా? అనే విచారణతో మనకు పనిలేదు. ఇదంతా ఎవరు చేస్తున్నారు. ఎవరి ఆజ్ఞానుసారం జరుగుతుంది? ఎవరి సంకేతానుసారం సాగుతున్నది? అని మాత్రమే మనం విచారణ చేయాలి. జరిగేదానికంతకు మూలం భగవానుడే.

మనకు దుఃఖం కలిగినా, బాధ కలిగినా, నొప్పికలిగినా అందులో భగవానుని కృపయేదాగి ఉంటుంది. ఈ కష్టాలు, బాధలు, వేదనలు, ప్రతికూలత్వము ఇవన్నీ పాపాల ఫలమందురా? పుణ్యాల ఫలమందురా? పాపాల ఫలమే అనుకుంటే వాని ఫలాన్ని అనుభవించివేస్తే ఆ పాపాలు నిలిచిపోతాయంటారా? నశించిపోతాయంటారా? నశించిపోతాయనుకుంటే ఆ నశించిపోవడంలో భగవానుని దయ ఉన్నదని అందురా? లేక నిర్దయత్వం ఉన్నదని అందురా? అందు భగవానుని సదయత్వమే పని చేస్తున్నది. కాని నిర్దయత్వం కాదనుట తథ్యం. అట్టి దశలలో భగవానుడు మనపై దయచూపి మనలను పరిశుద్ధులను చేస్తున్నాడని తలచుకొని మనము ఆనందమునే పొందాలి. కష్టంకాని, బాధకాని, నొప్పికాని అనుభవంలోనికి వచ్చినప్పుడు భగవానుడు మనపై కరుణ జూపుతున్నాడు. మనలను పవిత్రులను గావిస్తున్నాడని మనం అనుకోవాలి. స్వర్ణకారుడు బంగారాన్ని స్వీకరించేముందు ఏమి చేస్తాడు? దానిని నిప్పులలో కాల్చి, సుత్తెతో మొత్తి పరిశుద్ధం చేస్తాడు. అలా

పరిశుద్ధమయిన దానిని స్వీకరిస్తాడు. అలాగే భగవానుడు కూడ మనలను స్వీకరించేముందు పరిశుద్ధులను చేస్తాడు. కాబట్టి మనం భగవానుని ప్రతిచర్యయందు హర్షమునే పొందుతుండాలి.

సారాంశమేమంటే భగవానుని ఏ విధానంలోను అనర్థానికి తావులేదు. ఏది ఏ విధంగా జరిగినా అదంతా భగవానుని చేతిలోని విషయమని మనం అనుకుంటుండాలి. మనమేమి చేసినా భగవానుని ఆజ్ఞానుసారమే చేయాలి. తద్విరుద్ధంగా మాత్రం ఏదీ చేయకూడదు. ఒకటి- భగవదాజ్ఞానుసారముగా మనం ప్రతిపని చేస్తుండడం. రెండు- జరిగేది భగవన్నిర్ణయానుసారం జరగనివ్వడం. ఈ రెండు అంశాలు మాత్రం గుర్తుంచుకోవలసినవి. మూడవవిషయం ఏదీ లేదు. ఇలా జరుగుతుంటే మన జీవితమంతా సాధనామయం అవుతుంది. ఇక మనం ఎల్లవేళల సంతోషంగా ఉండవచ్చు. కాని మనం అలా ఉండడంలేదు. మనకు ఆ విధమైన లక్ష్యంలేదు. ఉన్నప్పుడే అలా సంతోషాన్ని పొందడానికి వీలుంటుంది.

కాబట్టి ఇరువదినాలుగు గంటలలోను సాధనామయం కాని క్షణం ఒకటి కూడ ఉండదు. మీరే చెప్పండి! సాధనారహితమైన సమయమేదయినా మిగిలిందని అంటారా? ఎల్లవేళలా భగవత్సంబంధమైన సాధన జరుగుతునే ఉందన్నమాట. ఇక ఏ ప్రవృత్తి, ఏ క్రియ కూడ భగవద్భజనరూపం దాల్చనిది ఉండదు. ఈ విధముగా "సర్వేషు కాలేషు మామనుస్మర" అన్న గీతావాక్యంలోని లక్ష్యం నెరవేరుతుంది.

"యత్క్షణం యన్ముహూర్తం వా వాసుదేవం న చింతయేత్"

కహ హనుమంత బిపతి ప్రభు సోఈ ।
జబ తవ సుమిరన భజన న హోఈ ।

అనగా వాసుదేవస్మరణరహితముగ సాగిన క్షణమే విపత్కరక్షణమని భావము.

భగవానుని స్మరణం లేకుండ సాగిపోయిన సమయమే విపత్కరసమయమని ఆంజనేయుడు కూడ చెప్పియున్నాడు. ఈ మాటలతో చెప్పినట్టి విపత్తు ఇక మనకు ఉండదన్నమాట. ఎల్ల సమయాలు

భగవానునివే. ఎల్ల పనులు భగవానునివే. ఎల్ల వస్తువులు భగవానునివే. ఎల్ల వ్యక్తులు భగవానునివారే. ఎల్ల సంబంధాలు భగవానునివే. మన వస్తువేదీలేదు. మనస్సు, బుద్ధి, శరీరము, ప్రాణము సర్వము భగవానునివే.

"త్వదీయం వస్తు గోవింద తుభ్యమేవ సమర్పయే"

దేవా! నీ వస్తువునే నీకు అర్పిస్తున్నాననుకుంటు ఆనందాన్ని పొందుతుండాలి.

మనవాడు అనదగినవాడు ఎవడు? కేవలము ఒక్క భగవానుడే. అతడే మనవాడు కావడం మనకు ప్రీతిహేతువు.

భగవానుడు వేరు, మనం వేరని అనుకుంటే రెండుగా విభాగం చేసినట్లవుతుంది. ఆనందాలు, సంతోషాలు మన వాటా. చింతలన్ని భగవానుని వాటా. నీవు చింతిస్తావా? నేను ఎందుకు చింతిస్తాను? భగవానుడు చింతించాలి. అతడు పెద్దవాడు, గొప్పవాడు. కాబట్టి అతడే చింతించాలి అంటావు. నరసీమెహతాకు ఉత్తరం వచ్చినది. ఫలానా ఫలానా వస్తువులు ఇంతింత పరిమాణంలో తీసుకొనిరావలసిందని పెద్ద లిస్టు అందులో వ్రాయబడుంది. ఉత్తరం మీద భగవానుని పేరు వ్రాసే పరిపాటి ఏనాటినుండియో సాగిస్తున్నదే కదా! ఉత్తరం చదువుకున్నాడు నరసీమెహతా. ఆనందంతో చిందులు త్రొక్కడం మొదలుపెట్టాడు.

లక్షలు, కోట్లు విలువచేసే వస్తువులు కావాలి. ఉత్తరంలో ఎన్నో వస్తువులు వ్రాయబడున్నాయి. వాని విషయం చదువుకొన్న నరసీమెహతా ఆనందానికి అవదులులేవు. అతడు చిందులు త్రొక్కడం, ఏమేమో పాడుకోవడం ఆరంభించాడు.

మీ చుట్టాలలో ఎవరైన మీకు ఒక ఉత్తరం వ్రాసారనుకోండి! ఏదైన ఫలానా పని చేయమని మీకు అందులో సూచించారనుకోండి దానికి సంబంధించిన బరువు, బాద్యత ఆ ఉత్తరం మీద ఎవరి పేరు వ్రాయబడి ఉంటుందో వారి మీదనే కదా పడేది? ఆ భారం వాని యింటిలోని పిల్లలమీద పడదుగా! చిన్నపిల్లలకు ఏ చింత ఉండదు. ఇంట్లో పెళ్లి. చాల సందడి. సరదాగా, ఆనందంగా కాలం గడపవచ్చు. మిఠాయిలు తినవచ్చు

పక్వాన్నభోజనం చేయవచ్చు. ఇలాంటివి చిన్నవాళ్ల ఆలోచనలు. తమ తండ్రి నెత్తిమీద ఖర్చు సంబంధంగా ఎంత బరువు వచ్చిపడుతుందన్న చింత వారికుండదు.

ఏమయ్యా! ఏమిటి నీ ఆనందం? ఎవరిని నమ్మి బయలుదేరుతున్నావు? అని ఎవరో అతనిని అడిగారు. నమ్మడం ఏమిటి? నాకు ఆ భగవానుడే సర్వస్వం. ఆయనే భోజనాదికానికి ఏర్పాటు చేస్తాడు. నీవు కూడ రావయ్యా! సోదరా! మధురాన్నాలు ఆరగించవచ్చును. ఇక్కడ మాకేచింతా లేదు. సరదాయే సరదా. సంతోషమే సంతోషమంటాడు నరసీ.

అలాగే మనం భగవానుని శరణుపొందాము. ఎల్ల చింతలు వంతలనుండి విముక్తులం అయిపోయాము. మనకిక ఏ బాధ్యతాలేదు. కార్యభారమంతా భగవానునిది అయిపోయింది. ఇక ఆనందమే ఆనందము. భగవానుని దర్బారునుండి బయటకురానేరాము. అయితే చిన్నపిల్లలలో కొందరు తెలివిగల పిల్లలుంటారు. అమ్మ ఒడిలోనుండి క్రిందకు దింపగానే వాళ్లు బోరున ఏడవడం మొదలుపెడతారు. మారాం చేస్తారు. అమ్మకు తమను ఎత్తుకోకతప్పని పరిస్థితిని కలుగజేస్తారు. వాళ్లకు ఇది చక్కని యుక్తన్నమాట. అలాగే మనం కూడ భగవానుని ఒడిలోనే ఉందాం. ఉంటాం. క్రిందకు దిగనే వద్దు. అందుచేతనే నారదుడు తన భక్తి సూత్రాలలో– "తదర్పితాఖిలాచారితా తద్విస్మరణే పరమవ్యాకులతేతి" అన్నాడు. అంటే సమస్తములైన ఆచరణాలను భగవానునకు అర్పించివేయడము, అతని విస్మృతిదశలో పరమవ్యాకులతను పొందడము అంటే భగవానుడు తన ఒడిలోనుండి దింపివేసిన వెంటనే ఆపలేని ఆరాటమును పొందడమని భావం. కాబట్టి మేము ఒడిలోనే ఉంటాం. క్రిందకు దిగమనే నిశ్చయం కలిగి ఉండాలి. బిడ్డను ఎత్తుకోవడంలో తల్లికి సుఖంకలిగినా, దుఃఖంకలిగినా దానితో వాడికి పనిలేదు. వాడు ఏం చేస్తాడు? అలాగే మనం కూడ క్రిందకు దిగనే దిగం.

దేవా! మేము మీ చరణాలమీదనే పడి ఉంటాం. ఆనందాన్ని పొందుతామనే భావన కావాలి. ఈ సత్సంగంనుండి వెళ్ళినా ఎక్కడకు వెడతాం? ఆనందానుభవంలోనికే వెడతాం. భగవానుని దగ్గరే మనముంటాము. భగవానుని పనినే చేస్తాం. భగవానుని దర్బారులోనే ఉంటాం. సంతోషమే సంతోషం. పరమాత్మ సన్నిధిలో ఆనందమే

ఆనందము. ఏ విషయంలో సంతోషము? అంటే ఆ సంతోషం మాత్రం ఏ విషయంలో ఉందని అనగలము? మాకు చింత ఎందుకు? ఆ చింత ఆ దీనదయాళుడైన ఆ పరమాత్మదే. ఆనందానుభవమే మావంతు. ఇప్పటినుండి ఆనందంగానే ఉందాం. ఆనందంతో తిరుగాడుదాం. ఆనందంతో లేద్దాం, కూర్చుందాం. ఇలా చేయడంలో జరిగేది కూడ భగవచ్చింతనమే. ఈ దశలో భగవచ్చింతనం వేరుగా చేయనక్కరలేదు. అది సహజంగానే జరుగుతుంది. అందుచేతనే ధ్రువుడిలా అన్నాడు –

విస్మర్యతే కృతవిదా కథమార్తబంధో ।

ఆర్తబంధూ! మిమ్ము మరచిపోవడమెలా సాధ్యమవుతుంది? మీరెలా మరుపుకు వస్తారు? మరచిపోయేది ఎలాగ? మీరే చెప్పండి! ఈ జన్మలో ఒకింత ప్రేమను ప్రదర్శించిన తల్లినే మరవలేము అంటుంటే అసంఖ్యాక జన్మలనుండి ప్రేమను ప్రదర్శిస్తూ వచ్చిన తల్లిని ఎలా మరవగలము? సర్వదా ప్రేమామృతమును వర్షించే భగవానుడు ఎలా మరపుకు వస్తాడు? కాబట్టి ఆ భగవానుని పాదాలమీద పడియుండడమే మన పని. ఆయనవంకకు అభిముఖులం కావడమే మన కర్తవ్యం. ఆ స్వామి మనలను స్మరిస్తునే ఉంటాడు. ఈ సందర్భంలో ఒక్క విషయం గుర్తుకు వస్తుంది.

శ్రద్ధగా హృదయంగమం చేసుకోండి. సాధారణముగా మనం భగవానుని స్మరించం. కాని ఆ స్వామి మనలను ఎప్పుడూ స్మరిస్తూనే ఉంటాడు. దానికి ప్రమాణం ఏమిటి? మీరు ఒక స్థితిలో ఉంటారు. కొన్నాళ్లకు ఆ స్థితినుండి విసుగు పుడుతుందా? పుట్టదా? కుటుంబపరంగా, ఆర్థికంగా, శారీరకంగా పనిపాటలతోటి అప్పుడప్పుడు విసిగిపోవడం. సంభవమా? కాదా! సంభవమే. అలాంటి పరిస్థితి ఎందుకు వస్తుంది? భగవానుడు మనలను స్మరించినప్పుడు వస్తుంది. అతడు మనలను తలపునకు తెచ్చుకొన్నప్పుడు మనకు విసుగు కలగడం సంభవిస్తుంది. అయినా మనం దేనివలన విసుగు పొందుతామో దానినే వదలకుండ పట్టుకుని కూర్చుంటాము. భగవానుడు మనలను తనవంకకు ఆకర్షిస్తుంటాడు. అప్పుడే మనకు విసుగు కలుగుతుంటుంది. కాని మనం

అలా మనమున్న పరిస్థితులనే అంటిపెట్టుకొని కూర్చుండడం భగవానునకు హితంకాదు. భోగసుఖాలలో, ధనసంపాదనలలో, కుటుంబవలయంలో చిక్కుకొని ఏ జీవుడు పడియుండడాన్ని భగవానుడు హర్షించరు కారణమేమంటే వానిలో ఎదురుదెబ్బలు తగిలించని పరిస్థితి ఒక్కటికూడా లేదు. ఉందేమో మీరు కూడ ఆలోచించండి! భగవానుడు మనలను విశేషంగా స్మరించినప్పుడే మనకు ఎదురుదెబ్బలు తగులుతుంటాయి. ఓరీ నీవు నన్ను మరచిపోయావురా! నన్ను స్మరించు! నన్ను కాదని ఎందెందు తిరుగాడుతున్నావురా? అన్నది భగవానుడు మనకు ఎదురుదెబ్బల మూలంగా అందిస్తున్న సంకేతము. అతడు మనలను స్మరించకపోతే మనకు సుఖంమీద ఇచ్ఛకలుగనే కలుగదు. పరమానందము, పరమసుఖము భగవానుని స్వరూపాలే. మనకు భగవదిచ్ఛ కలగడాన్ని ఆ భగవానుడే గుర్తుచేస్తుంటాడు. మనలను తనవంకకు ఆకర్షిస్తుంటాడు. అయితే అందులో బలవంతమేమీ ఉండదు.

మొత్తంమీద సారాంశమేమంటే- ఎల్ల పనులు, ఎల్ల సమయాలు భగవానునివే, అందరు వ్యక్తులు భగవానునివారే. ఎల్ల వస్తువులు భగవానునివే. ఏపని చేస్తున్నా మనకు ఈ విధమైన అనుభవము ఉండాలి. అలా అయితే నిరంతర సాధన జరుగుతుంది. తద్ద్వారా సర్వులకు శుభం చేకూరుతుంది.

~~~~oOo~~~~
~~~~

# 7. ఉపాసనంటే ఏమిటి ? దాని స్వరూపమెట్టిది ?

"ఉపాసన" అనే మాటకు చెంత కూర్చుండుట అని అర్థం. ఉప + ఆసన అనే రెండు శబ్దాలతో ఉపాసన అనే మాట ఏర్పడింది. ఉపాసనకు లక్ష్యం ధనం కావచ్చును, పేరుప్రతిష్ఠలు కావచ్చును, ఇహం కావచ్చును, పరం కావచ్చును ఏదయినా, కావచ్చును. ఎవడు ఏ వస్తువును కోరుతాడో వాని మనస్సు ఆ వస్తువు చెంతనే ఉంటుంది. దానినే ఉపాసించడం జరుగుతుంది. కాని నిజం చెప్పాలంటే సత్యతత్త్వానికి సంబంధించిన ఉపాసన జరగాలి. ప్రకృతియొక్క కార్యములను ఉపాసించడం మాని పరమాత్మను ఉపాసించాలి. భగవద్గీతలో మూడు రకాల ఉపాసన చెప్పబడింది –

శ్లో. ధ్యానేనాత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా ।
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥
(గీత. 13/24)

ఆ పరమాత్ముని ఎందరో మనుష్యులు పరిశుద్ధమైన సూక్ష్మబుద్ధిచే, ధ్యానమున హృదయములో దర్శింతురు. కొందరు సాంఖ్యయోగమున మరికొందరు కర్మయోగముననూ చూచుచున్నారు. అనగా పొందుచున్నారు. గీతలో మూడు ఉపాసనామార్గములు తెలుపబడినవి. భక్తియోగము, జ్ఞానయోగము, కర్మయోగము. సత్య తత్త్వాన్ని పొందడంకోసం చేసే సాధనయే ఉపాసన అనబడుతుంది. ఇదంతా పరమాత్మమయమైనది. ఆది, మధ్య, అంతములందూ అదే. "మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ" (గీత.7/7) "సూత్రంలో కూర్చబడిన మణులవలె సమస్త చరాచరప్రపంచము నాయందు నిక్షిప్తమైయున్నది" అని శ్రీకృష్ణుడు చెప్పినమాట. సత్తు, అసత్తు సర్వము పరమాత్మయే. ఈ విధమైన సత్యతత్త్వసాధన భక్తియోగమార్గంలో జరుగుతుంది. అసత్తును విడచి సాంఖ్యయోగపద్ధతిలో ఉపాసనచేయడం జరుగుతుంది. "నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః" (గీత. 2/16) సత్ లేని వస్తువుకు ఉనికి అంటూ ఉండదు. సత్తను దానికి ఉనికి లేకపోవడమంటూ ఉండదు.

కర్మయోగంలో కూడ సత్తు ఉపాసించబడుతుంది. "నేహాభిక్రమనాశోస్తి" (గీత. 2/40) అని భగవానుడు అన్నాడు. అంటే ఈ కర్మయోగమున ఆరంభ నాశనములేదు. భగవద్గీత పదునేడవ అధ్యాయం ఇరువది ఆరు, ఇరువది ఏడు శ్లోకాలలో "సత్" అనేమాటకు ఐదు విధాల వివరణము చెప్పబడినది. "సద్భావే", "సాధుభావే చ", "ప్రశస్తే కర్మణి తథా", "యజ్ఞే తపసి దానే చ స్థితిః", "కర్మ చైవ తదర్థీయం"

"సత్" అంటే సత్యస్థితి, దానికి నాశంలేదు. అది సర్వత్రా ఉన్నది. ఈ ప్రపంచము ప్రతిక్షణము పరివర్తనం చెందుతుంటుంది. అయినా సత్తును ఆశ్రయించి ఉండటంవల్ల ఇది ప్రత్యక్షంగా నాశమును పొందేదయినా సత్యస్వరూపంగా గోచరిస్తుంది. తులసీదాసు కూడ తన రామాయణంలో ఈ మాటే చెప్పాడు. ఈ ప్రపంచం సత్యంలాగ భాసిస్తుంది. కాని సత్యంకాదు. ప్రతి పదార్థంయొక్క ఉత్పత్తికి మూలంగా ఈ నిత్యతత్త్వం ఉంటుంది. దీని ఆశ్రయంవలననే పదార్థం ఉత్పన్నమవుతుంది. దానిని ప్రకాశింప జేయునవ్వరూలేరు. అది స్వయంప్రకాశమయినది. దాని సత్యత్వంవలననే సత్యం గోచరిస్తుంది. "తస్య భాసా సర్వమిదం విభాతి" (ము.ఉ. 2-2-10) దాని ప్రకాశంతోనే ఈ ప్రపంచమంతా ప్రకాశిస్తుంది. సాంఖ్యయోగంలో అసత్తును వీడి సత్తును ధ్యానించడం జరుగుతున్నది. ఆ తత్త్వంకోసం చేసే సాధనయే నిజమైన ఉపాసన.

చిన్ననాటి శరీరం ఈనాడు అలాగే ఉందా? లేదు. మారిపోయింది. సమాచారాలు, సామర్థ్యాలు, భావాలు, ఉద్దేశ్యాలు, ఇంద్రియాలు సర్వము మారిపోయాయి. "నేను" అనేది మాత్రం మారలేదు. ఆ "నేనే" సత్యం. దేశ, కాల, వస్తు, వ్యక్తి ఆదులన్నీ ఆ సత్తులో అంతర్గతాలయినవే. ఆ సత్తు తత్త్వం యథాతథంగా ఉంది. మనం అసత్తులో మాన్యత్వం పెట్టుకున్నాం. "కర్తాహమితి మన్యతే" (గీత. 3-27) మేమే కర్తలమని అనుకుంటున్నాం. అన్ని క్రియాకలాపములు సమిష్టి శక్తివలన జరుగుచున్నది? "ప్రకృతేః క్రియమాణాని" (గీత. 3/27). ఇట్టి స్థితిలో సంపూర్ణ క్రియలు సమిష్టిశక్తిద్వారా జరుగుచున్నవన్న విషయాన్ని గుర్తించాలి. "నైవ కించిత్కరోమీతి" (గీత. 5/8) నేనేమి చేయడం లేదు. నేను కర్తనుకాను భోక్తనుకాను అని అనుకోవాలి.

అయితే మానసికస్ఫూర్తి ఎలా పోతుంది? అన్నది ప్రశ్న. ఇక్కడ

వాస్తవికంగా పొరపాటుంది. ఆ స్ఫూర్తిని తొలగించుకోవడానికి మనం దాని కారణాన్ని కాక కార్యాన్నే నశింపజేయగోరుతున్నాము. కారణమేమంటే ఏ మనస్సులో స్ఫూర్తి కలుగుతుందో దానినే మనదనుకుంటున్నాము. అలా అనుకోరాదు. అది ప్రకృతిది. దాని సత్తావలననే మనకు స్ఫూర్తి కలుగుతుంది. ఈ పరివర్తనమంతా జరుగుతున్నది. ఈ ఉపాసనను సాంఖ్యయోగోపాసనమంటారు.

సత్తు, అసత్తులకు అతీతంగా దానిని అంటకుండ అందు పరివ్యాప్తులై భగవానుడే ఉన్నారు. "మయి సర్వమిదం ప్రోతం" (గీత. 7/7) ఎలాగంటే మట్టికుండ తయారు కావడానికి ముందున్నది మట్టియే. తయారైన తరువాత కుండరూపములో ఉన్నది మట్టియే. అది చితికి చెదరిపోయినప్పుడు ఉండేది మట్టియే. ఈ మాటనే ప్రపంచవిషయంలో కూడ చెప్పవచ్చును. ప్రపంచమునకు ముందు పరమాత్మ ఉన్నారు. ప్రపంచం ఉన్నప్పుడు పరమాత్మ ఉన్నారు. అది చెదరిపోయినప్పుడు పరమాత్మయే ఉంటారు. కడవకు సంబంధించిన మూతకు ఒక ఆకారము, ఒక రంగు అన్నీ ఉన్నప్పుడు అది ఎలా ఉపయోగపడుతుందో అలాగే ఈ ప్రపంచంకూడ నామరూపాత్మకమై ఉపయుక్తమవుతుంది. దీనిని పరమాత్మయే రచించారు. ఇది పరమాత్మరూపమే. తద్భిన్నమైన వస్తువేదీలేదు. ఇది అతనినుండియే ఉత్పన్నమయినది. అతనియందే లయం చెందుతుంది. కావున ఇది పరమాత్మరూపమే కాని వేరు కాదు. ఈ విధమైన ఉపాసన భక్తియోగోపాసన అవుతుంది.

ఇక నిష్కామభావ విషయముంది. నిష్కామత్వమనేది స్వతస్సిద్ధమైనది. కామన మాత్రం మనం కల్పించుకున్నట్టిది. ఇప్పుడీ విషయాన్ని విచారణ చేద్దాం. ధనసంబంధమైన కామన (కోరిక) ఉంది. పేరుప్రతిష్ఠలకు సంబంధించిన కామన ఉండనుకోండి! ఈ కామనలు ముందు ఉన్నాయిగావు. చిన్నప్పుడు గులకరాళ్లతో ఆడుకొనేవారం. అప్పుడు జ్ఞానం బహుతక్కువ. అనాడు ప్రత్యేకమైన కోరిక కూడ ఏదీలేదు. కాని యిప్పుడు ఈ కోరికలు పెరిగిపోతున్నాయి. ఒకప్పుడు ఒక వస్తువు కావాలని అనుకుంటే మరియొకప్పుడు మరియొక వస్తువు కావాలని అనుకుంటున్నాం. ఒకప్పుడు ద్రవ్యం కావాలనుకుంటున్నాం. ఇంకొకప్పుడు పేరుప్రతిష్ఠలు కావాలనుకుంటున్నాం. కాబట్టి కోరికలనేవి పుడుతునూ

ఉంటాయి. గిడుతునూ ఉంటాయి. నిరంతరము ఉండేవి మాత్రం కావు. కోరిక అంతరించేది కాదు అని జనులంటారు. కాని ఆ కోరిక శారీరకమైనదికాని, ఆర్థికమైనదికాని ఏదీ నిలువదు. అలా నిలువకపోవడం వెనుక భగవానుని కృపయే పని చేస్తుందని నేను అంటాను. చిన్నప్పుడు ఆటపాటలమీద ఇచ్ఛ ఉండేది. అది అంతరించి పోయింది. తరువాత ఎన్నోకోరికలు కలిగాయి. అవీ అంతరించిపోయాయి. మమకారం విషయం కూడ ఇట్టిదే. అది పెంచుకోబడుతుంది. త్రెంచుకోబడుతుంది. అక్కలు, చెల్లెళ్లుంటారు. ఒక కుటుంబంలో పుట్టినవారే కావచ్చు. మొదట్లో ఎంతో అన్యోన్యంగా ఉన్నవారే కావచ్చు. వారికి పెళ్లిళ్లు అవుతాయి. వారివారి అత్తవారి యిళ్లకు వారు వెళ్లిపోతారు. అప్పుడు వారికి క్రొత్తగా భర్తృగృహంవారితో మమతాబంధం ఏర్పడుతుంది. పెరుగుతుంది. పూర్వపు పుట్టినింటి వారితో బంధం తరుగుతుంది. ఏకోదరుడైన సోదరుడు ఎవరి యింటికైన దత్తుడై వెడలిపోతే వానితో ముందున్న మమకారబంధం తరువాత ఉండదు. అంత యేల? మన శరీరాన్నే చూడండి! చంటి బిడ్డలమై యున్నప్పుడు అమ్మ ఎంతో మమతతో మనలను తన ఒడిలో కూర్చుండబెట్టుకునేది ఆప్యాయతతో మనకు పాలు పట్టించేది. ఆమెకు మనమీద ఎంత మమకారం ఉండేది? ఇప్పుడు మనం యువకులము, ప్రౌఢులము అయిపోయాము. ఇప్పుడుకూడ ఆ తల్లికి మనమీద పూర్వమున్నంత మమకారమున్నది అని చెప్పగలమా? మనము వృద్ధులమగునప్పటికి ఆ మమకారం ఇంకా తగ్గిపోతుంది. కాబట్టి దీనినిబట్టి తేలిన సారాంశమేమంటే సాంసారికంగా ఉండే ఏయే వస్తువులమీద మనం మమకారం పెంచుకుంటామో అవి యేవికూడ స్థిరంగా నిలువవు. కాని ఆ మమకారానికి లోబడి లోభగ్రస్తులమై మనం ఏయే పాపాలు చేస్తామో అవి మాత్రం మనలను విడువక మనతో కూడ ఉండిపోతాయి. వ్యాపారంలో వస్తువులు రానూవస్తాయి, అమ్ముడై పోతాయి. కాని లాభనష్టాలు మాత్రం మన దగ్గర మిగిలిపోతాయి. అలాగే మమకార వ్యవహారంవలన పాపతాపాలు మాత్రం మన చేతికి దక్కుతాయి. లాభాల విషయంగా చింతలు, శోకాలు కలుగుతాయి. పడుచు పిల్లవాడు చనిపోతాడు. వాడు మొదట ఉన్నవాడుకాడు, ఇప్పుడు లేడు. ఇక వాడికోసం విచారం ఎందుకు? చింతలను, శోకాలను మిగల్చడమే మమకారము మనకు

కలిగించే లాభం.

ఒకప్పుడు బ్రహ్మలీనులైన జయదయాల్‌జీ గోయందకొగారి ముందు మహోదయుడైన ఒక సోదరుడు ఇలా ప్రశ్నించాడు - ఆర్యా! సర్వమూ పరమాత్మయే అయినప్పుడు మనం చేస్తున్న పాపాలు కూడ ఆ పరమాత్మ చేసినవే అవుతాయి కదా! "యే చైవ సాత్త్వికా భావాః ।" (గీత. 7/12) సాత్త్వికభావాలన్నీ పరమాత్ముని ఉపాసనయే అవుతుంది. రావణకుంభకర్ణాదులు ఘోరపాపాలు చేసికూడ పరమాత్మను పొందగలిగారు కదా! అలాంటప్పుడు మనం కర్తవ్యపాలనం చేసి బంధనాలలో చిక్కుకోవడమెందుకు? అప్పుడు జయదయాల్‌జీ ఆ ప్రశ్నకు ఇలా సమాధానం చెప్పినారు - మనమెలాంటి ఉపాసన చేస్తామో అలాంటి ఉపాస్యుడు మనకు ప్రాప్తిస్తాడు. అలాంటి ఉపాసన చేసినప్పుడు మనకు దుఃఖమయుడైన భగవానుడు లభిస్తాడు. దుఃఖం కూడ భగవత్స్వరూపమే కదా! మనం ఎలాంటి రూపాన్ని కోరుతామో అలాంటి ఉపాసన చేయాలి. రావణాదులవలె చేయాలనుకుంటే భగవానుని చేతిలో తప్ప ఇతరుల చేతిలో మరణించకుండ ఉండునట్టి శక్తి కావలసి ఉంటుంది. అలాంటి శక్తి ఉన్నప్పుడే రావణాదులు పొందిన మేలును పొందడానికి వీలుంటుంది. కాని యీ మధ్యలో ఎవరైన చంపివేస్తే అప్పుడు గతి యేముంటుంది? ఉద్ధరింపబడకుండ ఉండిపోవలసివస్తుంది. "జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే" (గీత. 6/44) యోగసంబంధమైన జిజ్ఞాస కలవాడుకూడ శబ్దబ్రహ్మమును అధిగమించి పోగలడని తాత్పర్యం. సత్యమైన మార్గాన్ని అనుసరిస్తే మోసపోవడమనేది ఉండదు. సర్వము పరమాత్మ స్వరూపమే అనడంలో ఉద్దేశ్యం ఏమిటంటే - ఒకడు సాకారాన్ని కోరుతాడు. ఇంకొకడు నిరాకారాన్ని కోరుతాడు. ఆ సాకారంలోను కూడ ఒకడు రామ, కృష్ణ, విష్ణు, శక్తి, శివ ఆది రూపాలను కోరుకుంటాడు. ఎవనికి ఏ రూపమందు ఆదర్శప్రాయమైన అభిరుచి ఉంటుందో దానిని ఉపాసిస్తే ప్రాప్తించేది ఆ స్వరూపమే అవుతుంది. మౌలికమైన సత్యతత్త్వాన్ని ఉపాసిస్తే మూలగతుడైన పరమాత్మయే సాక్షాత్కరిస్తాడు.

కర్మయోగములో కూడ సత్తును ఉపాసించడం జరుగుతుంది. ఇందు ఫలాసక్తి ఉండకూడదు. మమకారము, ఆసక్తి చావడం లేదు. ఏమి చెయ్యాలి? అంటారు జనులు. ఇక్కడ ఒక్క విషయం గమనించవలసి

ఉంది ఆసక్తి ఎల్లకాలము నిలిచి ఉండేదికాదు తల్లిప్రేమ మొదట్లో ఉన్నట్లుగా తరువాత ఉంటుందా? పడతిమీద పడుచుదనంలో ఉన్నంత ఆకర్షణ ముసలితనం వచ్చిన తరువాత ఉంటుందా ? ఏ వస్తువుకోటి అయినా చూడండి! ఇల్లు కట్టించుకున్నాం లేదా నగ చేయించుకున్నాం వాని మీద మోజు, ఆనందము మొదట్లో ఉన్నట్లుగా ఎల్లకాలముంటుందా? కొంచెం ఆలోచించి చూడండి! లోకంలో ఏ పదార్థము కూడ స్థిరంగా నిలిచేది కాదు. కాబట్టి మనం ఈ స్నేహాన్ని, ఈ మమకారాన్ని, ఈ ఆసక్తిని అశాశ్వతాలైన యీ లౌకికవస్తువులమీద పెట్టుకోవడం మాని భగవానునిమీద పెట్టుకుంటే మనకు జన్మసార్థక్యం ప్రాప్తిస్తుంది.

లోకంలోని వస్తువులన్నీ నశ్వరమైనవే వీనివలన మనకు ప్రాప్తించేదేదీలేదు అంతఃకరణం మలినం కావడము, అశాంతి మాత్రం మిగులుతాయి ఆదిలో తల్లికొడుకులమధ్య అనురాగం ప్రబలంగానే ఉండవచ్చును. కాని పెద్దవాడయిన తరువాత కొడుకు భార్యావిధేయుడై విరుద్ధంగా ప్రవర్తించడం మొదలుపెడితే తల్లికి వానిమీదున్న మమకారం విచ్ఛిన్నంకాకుండ అలాగే ఉంటుందా? మమకారమనేది బలంలేని దారంలాంటిది వైరుధ్యపు ఒత్తిడి తగలడంతో పుటుక్కున తెగిపోతుంది కాబట్టి మమకారాన్ని విడిచిపెట్టడం కష్టంకాదు. నిలుపుకోవడమే కష్టం ఇవి ఎల్లకాలము ఒకే విధముగా ఉండేదికాదు. మార్పు చెందుతుంటుంది దీనినిబట్టి తేలిన విషయమేమంటే మనకు ప్రీతి ఉండవలసిన చోట ఉండడంలేదు. ఐదు సంవత్సరముల పిల్లవాడు తన తల్లిని వెదుక్కుంటాడు. ఇతరులైన తల్లులు ఎందరో ఉంటారు. నేను నీ అమ్మనేరా! అని వారిలో ఎవరైన అన్నా వారి దగ్గరకు వెళ్లడు. వారిలో తన తల్లి ఉంటే ఆమె దగ్గరకే వెడతాడు. "మమైవాంశో జీవలోకే" (గీత. 15 7) భగవానుని అంశ తుదకు భగవానుని దగ్గరకే చేరుతుంది. అందుచేతనే గీతలో "యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ॥" (గీత 6/22) అని కూడ చెప్పబడింది. పరమాత్మ ప్రాప్తిరూపమగు ఏ లాభాన్ని పొంది, అంతకన్న అధికమైనదేదియు లేదని యెంచును అని యీ గీతావాక్యమునకు అర్థం. ఇది మాతృమూర్త్యుపాసన. నిజం చెప్పాలంటే జరుగవలసినది భగవదుపాసన. ప్రాప్తమైన వస్తువుమీద మమకారం, అప్రాప్తమైనదానిమీద అభిలాష ఇది సంసారకాంక్షాస్వరూపం

కర్మయోగంలో ఫలాపేక్షను పరిత్యజించాలి. నిష్కామభావంయొక్క వాస్తవికతత్త్వం "కర్మ చైవ తదర్థీయమ్" (గీత. 17/27), "నేహాభిక్రమనాశోస్తి", "స్వల్ప మప్యస్య ధర్మస్య" (గీత. 2/40) మొదలైన వాక్యాలలో స్పష్టం చేయబడినది, మమకారం చావకుంటే ప్రగతి సాగడం కష్టం అవుతుంది. తల్లికొడుకుల మధ్య, అన్నదమ్ముల నడుమ, భార్యాభర్తల నడుమ విశేషానురాగము, మమకారము ఉంటాయి. కాని ఏ కొంచెం ప్రతికూలత ఎదురైన, ఏ కొంచెం స్వార్థానికి విఘాతం కలిగినా ఆ మమకారం విచ్ఛిన్నమైపోతుంది. తల్లి, తండ్రి, సోదరుడు, కొడుకు, భార్య, తనువు, ధనము, మనస్సు, ఇల్లు, మిత్రుడు, కుటుంబము మున్నగువాని మీదున్న మమకారాన్ని త్యజించి ఆ బంధాన్ని మానసికంగా భగవానుని చరణారవిందములతోడ అనుసంధించుకోవాలని తులసీదాసు కూడ చెప్పియున్నారు.

నిజం చెప్పాలంటే మానవులు మమకారాన్ని విడిచిపెట్టడానికి ఇష్టపడరు. సరికదా! క్రొత్తక్రొత్త మమతాబంధాలను, కోరికలను కల్పించుకుంటుంటారు. మమతాబంధాన్ని త్రెంచుకోవడం కష్టంగా ఉంటే క్రొత్త బంధాన్నయినా కల్పించుకోకుండా ఉండడం మంచిది. ఇంటిమీద మమకారాన్ని త్రెంచుకుని సాధువైనవాడు మరల క్రొత్తగా శిష్యులతోటి, శిష్యురాండ్రతోటి మమకారబంధాన్ని పెంచుకోవడం ప్రారంభిస్తున్నాడు. మమతాబంధం ఎప్పుడు ఒక్కనితోనే పెట్టుకోవాలి. ఆ ఒక్కడు సత్యస్వరూపుడైన భగవంతుడు. అతనికంటే మనవాడని ఎన్నుకోదగినవాడు వేరెవ్వడు లేడు. సర్వసంబంధాలు త్రెంచుకొని కేవలం ఒక్క పరమపితయైన పరమేశ్వరునితోడ మమతాబంధం పెట్టుకోవడంలోనే సాధువులకు, మహాత్ములకు మహత్త్వము, పూజ్యత కలుగుతున్నాయి. "నీది ఇది కాదురా జీవా! అది" అని చెప్పి వారు దారితప్పి తిరుగాడుతున్న జీవుని సత్యంతోడ సంధానం చేస్తుండాలి. "మమైవాంశో జీవలోకే" (గీత. 15/7) అని గీత చెపుతున్నది. జీవులన్నీ భగవానుని అంశములే అనే భావముతో అందరను సేవించాలి. గౌరవించాలి. స్త్రీ భర్తనుబట్టియే అతనివారలకు అందరకు సేవ చేస్తుంది. అలాగే మనంకూడ భగవానునిబట్టి అతని వారలకందరకు సేవ చేయాలి. 'నాతో నేహ రామ సోఁ మనియత' ఆత్మీయతను భగవానునితోటే పెట్టుకోవాలి. అదే ఉపాసన. అదే భగవానుని

దగ్గర కూర్చోవడం.

చిత్రకేతుమహారాజునకు వేలాది మంది రాణులున్నారు. కాని కొడుకొక్కడూ లేడు. ఒకప్పుడు నారదుడు, అంగిరసుడు అను మహర్షులు చిత్రకేతుని దగ్గరకు వచ్చారు. వారిని మహారాజు ప్రార్థించాడు. వారి అనుగ్రహబలంతో అతనికి ఒక కొడుకు కలిగాడు. వానినికన్న తల్లిపై ఇతర రాణులకు అసూయకలిగింది. ఇక ఆ బిడ్డతల్లికే గౌరవాదరాలు అధికంగా ఉంటాయి. మనకు ఉండవు అని వారు ఆలోచించుకున్నారు. అందరూ కూడి ఆ పిల్లవానికి విషం పెట్టినారు. వాడి మరణముతో మహారాజు వ్యాకులత చెందాడు. సర్వత్ర శోకం ఆవరించింది. నారదుడు మళ్లీ వచ్చాడు. "మహర్షీ! నా కొడుకును బ్రతికించరా?" అని మహారాజు అతనిని వేడుకున్నాడు, అప్పుడు "నాయనా! నీకోసం నీ తల్లి, తండ్రి ఏడుస్తున్నారు. నీకు జాలిలేదా?" అని నారదుడు చనిపోయిన పిల్లవానిని అడిగెను. "మహాత్మా! నేను ఎవరెవరిమీద దయ చూపగలను? నేను ఎక్కడకు పోతే అక్కడ ఒక్కొక్క మాతాపితరుల జంట ఎదురవుతున్నది" అని పిల్లవాడు బదులు చెప్పెను.

జీవుడు ఎనుబది నాలుగు లక్షల యోనులలో పరిభ్రమిస్తుంటాడు. అతడు ఎందును చిక్కుకోడు. కాని ధనం ఎక్కడకు పోతే అక్కడ చిక్కుకుంటూ ఉంటాడు. అర్జునుని మోహం కూడ ఇట్టిదే. నా ముందు నా బంధువులు, ఆత్మీయులందరు నిలిచియున్నారు. నేను యుద్ధం చేయనని అర్జునుడు మోహమునకు లోబడియే పలికెను. భగవానుడు సత్యాన్ని తెలియజెప్పిన మీదట "నష్టోమోహః స్మృతిర్లబ్ధా" (గీత. 18/73) హే అచ్యుతా! నీ కృపచే మోహం నశించినది. నేను స్మృతిని బొందినాడను.

కర్మయోగములో మమకారము, ఆసక్తి, కామన (కోరిక) లేకుండ కర్తవ్యపాలనం చేయడం మూలంగా ఉపాసన చేయడం జరుగుతుంది. జ్ఞానయోగంలో పరమాత్మతత్త్వాన్ని తెలుసుకోవడం మూలంగా ఉపాసన జరుగుతుంది. భక్తియోగంలో భగవానుని నమ్మడం మూలంగా ఉపాసన జరుగుతుంది. జ్ఞానయోగంద్వారా ఏది ప్రాప్తిస్తుందో అదే కర్మయోగం ద్వార కూడ ప్రాప్తిస్తుంది.

"యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే ।" (గీత. 5/5)

"ఏకమప్యాస్థితః సమ్యగుభయోర్విందతే ఫలమ్ ॥" (గీత. 5/4)

జ్ఞానయోగులద్వారా ఏ పరమధామము పొందబడుచున్నదో, కర్మయోగుల చేత గూడ అదే పొందబడుచున్నది. ఈ రెండింటిలోను ఏ ఒక్కదానిలో స్థిరంగా నెలకొన్నా పురుషుడు రెండింటికి ఫలస్వరూపుడైన పరమాత్మను పొందుతాడు. కర్మయోగంలో కూడ భగవానుని నమ్మి ఉపాసించడం జరుగుతుంది. సంసారమునందు విరక్తుడై చరించుట, భగవానుని దగ్గర కూర్చుండుట రూపంగా ఈ ఉపాసన జరుగుతుంది. ఏదో కొంత తడవు జపం చేయడం, పూజాపఠనాలు గావించడముతో సరిపెట్టుకోవడం సరియైన ఉపాసన కాదు. అనుక్షణము భగవానుని మీద లగ్నమనస్కులై ఉండడం నిజమైన ఉపాసన. మనస్సు అనుక్షణము ఎలా కుటుంబంమీద లగ్నమై ఉంటుందో అలాగే సర్వకాల సర్వావస్థలయందు పరమాత్మమీద లగ్నంకావాలి. ఇది నిజమైన ఉపాసన. ఇది తప్పక సిద్ధిస్తుంది. మనకు ఈ మానవశరీరం ఇందుకోసమే ప్రాప్తించినది. సంసారంకోసం ప్రాప్తించి ఉంటే అది సిద్ధించాలి. కాని అది సిద్ధించదు. కాబట్టి శరీరం పరమాత్మప్రాప్తికోసమే వచ్చినది. అతనినే ఉపాసించాలి. ఉపాసనాప్రభావం దాచుకొందామన్నా దాగదు.

పాతాళంలో ఉండి భజన చేసినా దాని ప్రభావము ఆకాశంలో ప్రకటమవుతుంది. కస్తూరిని దూర్వాంకురాల మరుగున దాచినా దాని సుగంధం వెలికి రాక మానదని ఒక కవి చెప్పిన మాట.

పరమాత్మ దిక్కుగా ప్రయాణించడం ఆరంభించినా, పరమాత్మను పొందినా మానవుని ఆచరణం మారిపోతుంది. అతని శరీరంలోను, బలంలోను, బుద్ధిలోను పరివర్తనం వస్తుంది. వాని ప్రభావం వాతావరణంలో కూడ మార్పును కలిగిస్తుంది. తనకు తాను సఫలతను అందినట్లు ప్రకృతి పరవశిస్తుంది. భక్తునిచేత ఉపయోగింపబడే వస్తువులు తమ ఉనికి సఫలమైనదని సంతోషిస్తాయి.

~~~~oOo~~~~
~~~~

# 8. సర్వోన్నత పదప్రాప్తికి సాధనము

## ప్రాప్తించిన సామర్థ్యాన్ని సద్వినియోగం చేసుకొనే విధము

మీరే బాగుగా ఆలోచించండి! ధనము మొదలైన పదార్థములలో మనకు సుఖం గోచరిస్తుందా? లేదా? గోచరిస్తుంది. వానినుండి మనం సుఖాన్ని అపేక్షిస్తున్నామా? లేదా? అపేక్షిస్తున్నాము. అయితే వానిలో సుఖముందని అంటారా? వానితో సంబంధం పెట్టుకుంటే ఇక ఎన్నడూ దుఃఖం కలుగదంటారా? అవి యెల్లప్పుడూ మన వెంట ఉంటాయంటారా? అవి ఉండగా మనకు దుఃఖమన్నది కలుగనే కలుగదు అని చెప్పగలరా? చెప్పలేరు. కారణం? అది అసంభవం. అంతే కాదు. వానితో సంబంధం పెట్టుకోవడంవలన, వానితో మమతాబంధమేర్పరచుకోవడం వలన లోభంవంటి మహాదోషం ఆవిర్భవిస్తుంది. అది నరకద్వారం. అది బొందిలో ప్రాణాలున్నంతకాలము మానవుని మానసికంగా కాల్చి వేస్తుంటుంది. మరణానంతరము వానిని దుఃఖమయాలైన సర్పాదియోనులలోనికీ, దుర్భర యంత్రణామయాలైన దారుణ నరకాలలోనికీ నెట్టివేస్తుంది.

మీరే యోచించండి. మీరు మీ కుటుంబసభ్యుల నుండి, ఇతరులనుండి సుఖాన్ని అపేక్షిస్తున్నారా? లేదా? అపేక్షిస్తూనే ఉన్నారు. అయితే వారందరు సుఖంగా ఉన్నారని చెప్పగలరా? వారికి ఎన్నడూ దుఃఖం కలుగలేదని నుడువగలరా? వారెల్లరూ ఎల్లవారికీ అనుకూలంగా ఉన్నారంటారా? వారందరు మీ వెంట ఉంటున్నారా? ఉండాలని కోరుకుంటున్నారా? ఇంతకు ముందున్న మీ సహచరులు ఇప్పుడు మీతో ఉంటున్నారా? వారి మనస్సులలోను, శరీరాలలోను మార్పురాలేదని మీరు చెప్పగలరా? వారిలో ఏ ఒక్కనికికూడ దేని కొరతనో తలపోసి ఎన్నడూ మానసికంగా కలత అన్నది కలుగలేదని మీరు చెప్పగలరా? వారు ఎల్లవేళలా ఎల్లవిధములా పరిపూర్ణులై ఉన్నారని మీరు అనగలరా? వారు ఏనాడూ, ఎవ్వరినుండీ ఏమీ అపేక్షించలేదని నుడువగలరా? కనీసం మీ నుండైన ఏమీ అపేక్షించకుండ ఉన్నారా? మీరే ఆలోచించండి, ఇతరుల నుండి ఏమైన అపేక్షించేవాడు ఇతరుల అపేక్షలను సఫలం చేయగలడా? తనకు సుఖం కావాలని అనుకునేవాడు పరులకు సుఖం గలిగింపగలడా?

గుర్తుంచుకోండి! సర్వదా సర్వులకు సర్వముతోటి లేదా సర్వులతోటి వియోగం సంభవిస్తూనే ఉంది, ఉంటుంది. అనుక్షణమూ ఆయువు క్షీణిస్తుంది. మృత్యువు సమీపిస్తుంది. ఆలోచించి చూచుకుంటే ఈ విషయాలు మనకు గోచరంకావంటారా? ఎందుకు కావు? అవుతాయంటారా? అట్లయితే వాటిని గమనించరేమి? ఇప్పటివరకు గమనించలేదు. ఇంకెప్పుడు గమనిస్తారు? దేనికోసం లేక ఎవరికోసం ప్రతీక్షిస్తున్నారు? ఈ వ్యామోహంలో ఈ వెర్రిలో పడి ఉండడంలో మీకేమైన మేలు కానవస్తుందా? కానరావడంలేదంటారా? అయితే మీకు హితం ఎవరు కలిగిస్తారంటారు? ఎవరిని లేక దేనిని నమ్ముకొని నిశ్చింతగా కూర్చున్నారు? ఇలాగే ఉంటే కార్యసాధనం ఎప్పటికవుతుంది? ఈ విషయంలో మీరేమైన ఆలోచించారా? లేకుంటే మరెప్పుడు ఆలోచిస్తారు? మీకు నిజమైన సహచరుడు ఎవడంటారు? నాది, నేను అని మీరు చెప్పుకుంటున్న ఈ శరీరం మీ కోరికమేరకు ఆరోగ్యంగా ఉంటుందంటారా? మీరు ఆశించిన విధముగా అది మీకు సహకరిస్తుందా? ఇది ఎల్లవేళలా మీవెంట ఉంటుందంటారా? దీనికి మరణం రాదని చెప్పగలరా? ఈ విషయాన్ని మీరెప్పుడైన వివేకదృష్టితో పరికించారా? లేకుంటే మరెప్పుడు పరికిస్తారు? ఇలా ఈ విషయాలలో పరిచయం లేకుండా ఉండిపోవడం యుక్తమా? అది బుద్ధిమంతతనం అవుతుందా? దీని పరిణామాన్ని మీరుగాక అన్యులెవరైన అనుభవిస్తారని మీరనుకుంటున్నారా?

ఒకింత నిదానించి మీరే ఆలోచించండి! ఆదిలో ఏ పదార్థాలతో మీరు సంబంధం కలిగి ఉండేవారో అవిప్పుడు ఉన్నాయా? ఏ కుటుంబసభ్యులతో సంబంధం కలిగి ఉండేవారో వారిప్పుడు ఉన్నారా? ఈనాడు మీతో ఉన్నవారిలాగే భవిష్యత్తులోకూడ ఉంటారంటారా? వారందరూ ఎల్లకాలమూ మీవెంట ఉండేవారే అని మీరు చెప్పగలరా?

ఆ వస్తువులు కాని, వ్యక్తులు కాని ఎల్లకాలము మీవెంట ఉండేవి, ఉండేవారు కారు అని, కేవలమూ ఒక్క పరమాత్మ మాత్రమే సర్వదా మీవెంట ఉండేవాడు అనీ, ఒకింత వివేకదృష్టితో ఆలోచిస్తే మీకే తెలియవస్తుంది. కాబట్టి మీరు ఆ పరమాత్మ చరణాలనే శరణుపొందాలి.

1. పరమాత్మయందు నిత్యసిద్ధమైన ఆత్మీయతాలక్షణం ఉంది. జీవుడే దానిని మరచిపోయాడు. సంసారంలో (లోకంలో) ఆ ఆత్మీయతాలక్షణానికి తావేలేదు. ఉందని అనుకొన్నా అది నిలిచేది కాదు. భ్రాంతి చేత జీవుడు అది ఉందని అనుకుంటున్నాడు.

2. పరమాత్మతోడ వియోగం అనేది ఎన్నడూ కలుగదు. అట్లే సంసారంతో సంయోగం అనేది ఎన్నడూ నిలువనే నిలువదు.

3. పరమాత్మ జీవుని ఎన్నడూ విడువనే విడువదు. సంసారం జీవుని అంటి పట్టుకొని ఉండనే ఉండదు.

4. పరమాత్మయందు ఉన్నది ఆనందమే ఆనందము. అక్కడ దుఃఖానికి నిలువ తావేలేదు. సంసారంలో (లోకం) ఉన్నదంతా దుఃఖమే. ఆనందానికి స్థానమేలేదు.

కాబట్టి గుర్తుంచుకోండి! ఈ జీవుడు పరమాత్మయొక్క అంశవలన ఏర్పడినవాడు. మన యింటిలోనూ, గదులలోనూ ఉన్న ఆకాశం బయట ఉన్న విశాలమహాకాశం యొక్క భాగంకాదా? అలాగ అన్నమాట. 'మమైవాంశః' (గీత. 15/7) అని గీత చెప్పుతున్నది. "ఈస్వర అంస జీవ అబినాసీ" (మానస). పరమాత్మ సర్వోత్తముడు. పరమాత్మయొక్క అంశమైనకారణాన జీవుడు నిమ్నస్థాయిలో ఉండడానికి ఇష్టపడడు. అలా ఉండడమతనికి రుచించదు. సర్వోత్తమత్వం దిశగా సాగిపోవాలనే ఉత్సుకత అతనిలో నిరంతరంగా నెలకొని ఉంటుంది. అతడు సర్వోన్నతపదాన్నందుకోవడంకోసం ప్రయత్నం చేస్తుంటాడు. కారణమేమంటే అతడు పరమాత్మయొక్క అంశమైనవాడు. ఆ పరమాత్మ సర్వోన్నత స్థానీయుడు. ఆ కారణంగానే జీవుడు తానుకూడ ఉన్నతస్థానంకోసం యత్నిస్తూ ఉంటాడు. అతడు ఏ రంగంలో, ఏ క్షేత్రంలో ఉన్నా అక్కడ ఉన్నతస్థానము పొందాలని అపేక్షిస్తూ ఉంటాడు.

అలా ఉన్నతస్థానము చేరాలని అనుకునేవాడు రెండు అంశాలను దృష్టిలో ఉంచుకొంటే బహుశీఘ్రంగా ఉత్తమస్థానం చేరగలుగుతాడు. అవి

ఏవంటే 1. చేయడం, 2. కావడం (జరగడం) ఎలాగంటే మనం వ్యాపారం చేస్తాము. (ఇది చేయడం) అందు లాభనష్టాలు కలుగుతూ ఉంటాయి. (ఇది కావడం లేక జరగడం) కాబట్టి అనుక్షణమూ చేయడం కోసం ప్రయత్నిస్తూనే ఉండాలి. జరగడం ఎలా జరిగినా ప్రసన్నతనే వహిస్తుండాలి. జరుగుతున్నది ప్రతీది మనం పూర్వంచేసుకున్న కర్మలకు ఫలరూపంలో జరుగుతుంటుంది. అలా జరగడమనేది మన పరమప్రభువైన పరమాత్ముని మంగళమయమైన విధానాన్ని అనుసరించియే సంభవమవుతుంది. ఈ విధమైన ధారణ మనకు సిద్ధించాలి. మనదృష్టి మన లక్ష్యంమీద స్థిరంగా నిలిచినప్పుడు అది మనకు సిద్ధిస్తుంది. ఇలా చేసినవాళ్లు ఉన్నతిని పొందుతారు. అభివృద్ధిలోకి వస్తారు. అది నియమము. కాని, మనమేమి చేస్తున్నాము? ఆచరణశీలురం కావడం లేదు. చేయడంలో జాగరూకతను పాటించడంలేదు. జరగడం విషయంలో మాత్రం అనుకూలంగా ఉంటే ప్రసన్నతను, అననుకూలంగా ఉంటే అప్రసన్నతను పొందుతున్నాము.

చేయడంలో మనము అనుక్షణమూ జాగరూకతను పాటించాలి. జాగరూకత అనగా కూడనిపని చేయరాదు. సాధ్యము కానివానికై చింతించరాదు. అనగా శాస్త్రవిరుద్ధమూ, లోకమర్యాదకు విరుద్ధమూ అయిన పనిని ఎంతమాత్రమూ చేయరాదు. మనం కావాలని కోరినా పొందశక్యం కాని ధనము, గౌరవము, మహత్త్వము, పదవి, అధికారము మొదలైనవాటిని గూర్చి చింతించరాదు. కూడనిపనిని గూర్చి తలపెట్టకపోవడము, సాధ్యము కానిదానికై చింతపెట్టుకొనక పోవడము వలన ఆవశ్యకకార్యం విషయంలో మనలో తగినంత బలము, యోగ్యత, ఉత్సాహము ఆవిర్భవిస్తాయి. "కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన" (గీత. 2/47) అని అంటూ గీతలో భగవానుడు ఈ మాటనే చెప్పెను. అనగా నీకు కర్మ చేయుటయందే అధికారమున్నది దాని ఫలములయందు కాదు అని భావం. కాబట్టి మానవుడు ఫలాపేక్షారహితంగా పనిచేయాలి.

పరుల క్షేమంకోరి స్వార్థాన్ని త్యజించి చేయబడే కర్మ కర్తవ్యకర్మ అనబడుతుంది. స్వార్థబుద్ధితో చేయబడే కర్మ కర్తవ్యకర్మకాదు. అది కర్మమాత్రమే. ఈ కర్మ కర్మాధికారంలేని పశువులు, పక్షులు మొదలైన వానిలోకూడ కానవస్తుంది. అలా అయినప్పుడు వాటికంటే

మానవజీవితానికి విశేషంగా చెప్పుకోదగిన సార్థక్యం ఏముంటుంది? కాబట్టి మానవుడెప్పుడూ తన స్వార్థాన్ని పరిత్యజించి పరులకు సుఖం కలిగించడానికి ప్రయత్నం చేస్తుండాలి. వారికి సుఖం కలిగించడంకంటె హితం కలిగించే దృక్పథం ఎక్కువగా కలిగి ఉండాలి.

శ్లో. సంతోషస్త్రిషు కర్తవ్యః స్వదారే భోజనే ధనే ।
త్రిషు చైవ న కర్తవ్యః స్వాధ్యాయే జపదానయోః ॥

ఇది నీతికారుడు చెప్పినమాట. దీని భావం ఏమంటే తనకు ప్రాప్తించిన భార్య, భోజనము, ధనము ఈ మూడింటి విషయంలోనూ మానవునకు తృప్తి ఉండాలి. స్వాధ్యాయమూ (వేదాధ్యయనమూ) జపము, దానము – ఈ మూడింటి విషయంలోనూ చేసినది చాలునన్న తృప్తి ఉండరాదు.

భార్య, భోజనము, ధనము అనేవి పూర్వజన్మగతకర్మలకు ఫలరూపంగా ప్రాప్తించేవి. కాబట్టి వానివిషయంలో తృప్తి ఉండాలి. స్వాధ్యాయము, జపము, దానము అనేవి క్రొత్తగా ఇప్పుడు ఆరంభించిన కర్మలు. కాబట్టి వానివిషయంలో తృప్తి ఉండకూడదు. ఇంకనూ చేయాలి, ఇంకనూ చేయాలి అనే తపన ఉండాలి. అట్లుకాక తృప్తిపొందడం జరిగితే మానవుడు కర్మభ్రష్టుడు అయిపోతాడు. కావున ఎంతో తత్పరతతోడ మానవుడు కర్తవ్యకర్మమందు సంలగ్నుడుకావాలి.

ధనాదుల విషయంలో మనం సంతుష్టి పొందాలని నీతి చెపుతుంది. అంటే మనకు ఏది ప్రాప్తిస్తే దానితో మనం తృప్తి చెందాలన్నది ఆ నీతిలోని ఆశయం. అయితే కర్తవ్యకర్మాచరణం విషయంలో మాత్రం మనం ఎన్నడూ వెనుకపడకూడదు.

మానవునకు ఏ పనియందు అభిరుచి ఉంటుందో దానిని అతడు ఎంతో తత్పరతతోడ ఆచరిస్తాడు. అట్టివానికి ఉన్నతి కలుగుతుంది. అలా చేయడము, అలా జరగడము ప్రకృతిగతమైన నియమం అన్నమాట.

ఈనాడు దేశంలో పనిలేనితనం (నిరుద్యోగదశ) సర్వత్రా వ్యాపించి ఉంది. దానికి ఎన్నోకారణాలు ఉన్నాయి. వానిలో కర్తవ్యకర్మలను ఆచరించకపోవడం అనేది ఒక ప్రధానకారణం. ఉత్తమోత్తమాలైన కర్మల ఆచరణంలో మానవుడు నిరంతరము నిమగ్నుడై ఉంటూ ఉంటే,

రుచులను (జిహ్వాచాపల్యము), విలాసాలనూ, అలంకారాలనూ వీడి సాధారణ వస్తువులతో జీవనయాత్ర సాగించుకుంటుంటే, పరులను సేవించడం కోసము, వారికి హితము కలిగించడం కోసము తన వస్తువులను, శక్తినీ వినియోగిస్తుంటే, పరుల హక్కులను పరిరక్షిస్తూ, ఎట్టిదశలోనూ వారి హక్కు తన హక్కులతో కలియకుండునట్లు జాగరూకత వహిస్తూ దక్షతతో కర్తవ్యకర్మపాలనం చేస్తుంటే వానికి పనిలేనితనపు బాధ కలుగదు. మన ప్రారబ్ధంలో ఉన్నదేదో అది మనకు లభిస్తుంది, లేనిది లేదు అనేమాట ఒకటి ఉంది. దేనికోసమైన చింతించకుండా ఉండడంలోనే ఆ మాటకు ప్రయోజనముంది. కాని, ఏ పనీలేక నిరర్థకంగా అకర్మణ్యుడుగా పడి ఉండడంలో లేదు. కాబట్టి కర్తవ్యకర్మాచరణంలో ఎన్నడూ లోపం రానిచ్చుకోకూడదు. ఈ విధముగా తత్పరతతో పని చేసేవాడు ఇటు వ్యావహారికంగానూ, అటు పారమార్థికంగానూకూడ ఉన్నతిని పొందుతాడు. అయితే ఆ రెండు దశలలోనూ కొంచెం భేదముంది. ఎలాగంటే వ్యావహారికంగా ఉన్నతిని పొందడంకోసం తత్పరతతో పాటుపడేవారిలో కార్యకుశలత్వము, కార్యాచరణ యోగ్యత పెంపొందుతాయి. కాని, అందువలన వారికి ధనసంపద, పేరుప్రతిష్ఠలూ, గౌరవాదరాలూ లభిస్తాయి అనడానికి వీలులేదు. లభించాలన్న నియమమూ లేదు. కారణమేమంటే అవి పురాకృతకర్మల ప్రారబ్ధాన్ని అనుసరించి లభిస్తుంటాయి. దీనికి భిన్నంగా, పారమార్థికంగా ఉన్నతిని పొందడంకోసం పాటు పడేవానికి తప్పక సాఫల్యం కలుగుతుంది. అనగా వానిలో ప్రేమ, వివేకము, శాంతి, ఉత్సాహము, ప్రమాదరాహిత్యము, సోమరితనము లేమి, కార్యకుశలత, మొదలైన సద్గుణాలు విధిగా ఉదయిస్తాయి. తద్వారా అతడు తత్పరతతోడ పనిచేయడం సంభవమవుతుంది. కారణమేమంటే ఇవి అన్నీ అతని సొంత వస్తువులు.

అయితే ఈ భేదమేల అన్నది ప్రశ్న. దీనికి సమాధానమిది:- మనకు మానవశరీరం ఎందుకు ప్రాప్తించింది? పరమాత్మను పొందడంకోసం మాత్రమే ప్రాప్తించింది. కాబట్టి పారమార్థికమైన ఉన్నతిని కోరి తత్పరతతోపాటుపడే వానికి అది విధిగా లభించి తీరుతుంది. కాని, ఏ ప్రయత్నమూ చేయక అకర్మణ్యుడుగా ఉన్నవానికి అదెలా ప్రాప్తిస్తుంది? ఇక వ్యావహారిక వస్తుప్రాప్తి విషయం ఉంది. అది ప్రారబ్ధాధీనమైనది.

ప్రారబ్ధం అనుకూలించినప్పుడు వస్తువు లభిస్తుంది. కాని, అది ప్రయత్నిస్తే లభించేదని అనడానికి వీలులేదు. అలా లభించాలి అనే నియమమూ లేదు. అనగా పరమార్థ (ఆధ్యాత్మికత) ప్రాప్తికి అభిలాష, తత్పరత ప్రధానమైనవి. సాంసారికములైన వస్తువుల ప్రాప్తికి ప్రారబ్ధం ప్రధానమైనది అన్నమాట. కాబట్టి మానవుడు ఎన్నడూ కర్మచేయనివాడైయ్యునూ, మత్తులోను ఉంటూ కాలాన్ని నిరర్థకంగా గడపివేయరాదు. ఎల్లవేళలా స్వాధ్యాయము, జపము, శాస్త్రాల మననము, చేస్తు ఎల్లరకు హితం కలిగించాలనే విషయాన్ని గూర్చి చింతనము చేస్తుండాలి.

ఎల్లరకూ హితం చేకూర్చాలనే విషయాన్ని ఆలోచనలో ఉంచుకుంటే ఎల్లరకూ హితం చేకూరుతుంది. కాని, స్థూలబుద్ధి కలవారు ఈ విషయాన్ని గ్రహించరు. స్థూలవస్తువు ఏకదేశీయమవుతుంది. అంటే ఎక్కడో ఒకచోట మాత్రమే ఉంటుంది. కాని, సూక్ష్మవస్తువు అట్లుకాదు. అది సర్వత్రా వ్యాప్తిచెందేదవుతుంది. భావాలు సూక్ష్మంగా ఉండేవి, ఉంటాయి. కాబట్టి సర్వహితభావన మనస్సులోనికిరాగానే అది అచ్చటి వాయుమండలంతో విస్తరిస్తుంది. తద్వారా ఎల్లరకూ సుఖం చేకూరుతుంది. అందుచేతనే భగవానుడు గీతలో, "తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః" (12/4) అని అన్నాడు. అంటే సర్వభూతహిత భావన కలవారికి పరమాత్మతత్త్వం ప్రాప్తిస్తుందన్నమాట. ఎవని అంతఃకరణంలో రాగద్వేషాలు అంతరించి సర్వభూతహితభావన జాగరూకమై ఉంటుందో వానికి సమష్టితోడ ఏకత్వం ఏర్పడుతుంది.

"సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి" (గీత. 5/29) అని భగవానుడు గీతలో అన్నాడు. అనగా తనను (భగవానుని) సమస్తభూతాలకూ సుహృదునిగా గుర్తించినవానికి శాంతి లభిస్తుందని భావం. ఈ పరిస్థితిలో "సర్వే భవంతు సుఖినః" ఎల్లరూ సుఖపడాలనీ, "సర్వే సంతు నిరామయాః" ఎల్లరూ ఆరోగ్యవంతులు కావాలనీ, "సర్వే భద్రాణి పశ్యంతు" ఎల్లరకూ శుభం చేకూరాలనీ, " మా కశ్చిద్ దుఃఖభాగ్ భవేత్" ఎవ్వనికి ఈషణ్మాత్రము దుఃఖం కలుగకూడదనీ యీ విధమైన సర్వభూతహితభావన ఎవనిలో ఉన్నా అది భగవానుని భావనతో ఏకమవుతుంది. అనగా ఈ భావన, భగవానుని భావన రెండూ ఒకటే అన్నమాట. అలా ఏ మానవుని భావన భగవానుని భావనతో

ఏకమవుతుందో వాడు ఆ భగవానునికంటె భిన్నమైనవాడుకాడు. వానికి ఆ భగవానునితో అబిన్నత్వం ప్రాప్తిస్తుందన్నమాట. కాని, ఆ మానవుడు తనలో అహంకారానికి చోటిస్తేమాత్రం ఇకవానిలో ఆ శక్తి నిలువదు.

"దేవో భూత్వా యజేద్దేవమ్" అన్నది శాస్త్రముల ఆదేశం. అంటే ముందు తాను దేవుడై తరువాత దేవతలను పూజించాలి అని తాత్పర్యం. అలాగే ఒక మంత్రాన్ని సిద్ధింపజేసుకోవాలని అనుకొంటే ఆ మంత్రాన్ని తనలో న్యాసం చేసుకొని తాను మంత్రస్వరూపుడు కావాలి. ఆ విధముగానే సర్వభూతహిత భావన ఎవనియందుంటే వాడు పరమాత్మతత్త్వాన్ని పొందుతాడు. కావున మానవుడు సర్వదా సర్వభూతహితభావన కలిగి ఉండాలి. అలా ఉండడమే పరమాత్మను పొందడానికి తగిన ఉపాయమవుతుంది.

సుర నర ముని సబ కై యహ రీతీ ।
స్వారథ లాగి కరహిఀ సబ ప్రీతీ ॥
(కిష్కింధా. 11/1)
స్వారథ మీత్ సకల జగ మాహీఀ
సపనేహుఀ ప్రభు పరమారథ నాహీఀ ॥
హేతు రహిత జగ జుగ ఉపకారీ
తుమ్హ తుమ్హార సేవక అసురారీ ॥
(ఉత్తర. 46/3)

ఇది తులసీదాసు తన రామాయణంలో చెప్పిన మాటలు. వీని భావమేమంటే దేవతలేమి? మానవులేమి? మునులేమి? అందరూ స్వార్థప్రేరితులై ప్రేమను ప్రదర్శించేవారే. ఎల్లరూ స్వార్థానికే మిత్రులు. కలలోకూడ పరమార్థంతో మైత్రిని కోరేవారులేరు. ప్రభూ! నిర్హేతుకంగా లోకానికి ఉపకారం చేసేవారు ఇరువురే ఉన్నారు. ఒకరు మీరు. రెండవవాడు మీసేవకుడు (భక్తుడు).

కాబట్టి ఎవడు నిస్వార్థంగా హితం చేకూర్చాలి అనే భావన కలిగుంటాడో వాడు భగవానుని జాతివాడు అయిపోతాడు. వస్తుతః ఎల్లరూ భగవానుని జాతివారే. స్వార్థానికి లోబడి జడపదార్థాలను ఆశ్రయించడం

చేత జీవుడు నిమ్నస్థాయికి దిగిపోయినాడు. సాధువులుకూడ ఇచ్ఛను ఎలా నిరసించారో చూడండి

చాహ చూహడీ రామదాస సబ నీచనమె నీచ ।
తూ తో కేవల బ్రహ్మ థా, చాహ న హోతీ బీచ ॥

సంత్ రామదాసు పల్కుచున్నాడు. ఇచ్ఛ అనేది చాలా నికృష్టమైనది. ఈ ఇచ్ఛ అనేది అడ్డురాకుంటే సాక్షాత్తూ నీవు పరబ్రహ్మస్వరూపానివే.

కాబట్టి ఇచ్ఛమూలంగానే జీవుడు ఉన్నతస్థాయి నుండి క్రిందకు దిగజారిపోయాడు.

"హై శ్రేష్ఠసే భీ శ్రేష్ఠ తూ, పర్ చాహ కరకే భ్రష్ట హై" అని ఒక కవి చెప్పిన సూక్తికూడ ఈ భావాన్నే వ్యక్తం చేస్తున్నది. జీవా! నిజానికి నీవు సర్వశ్రేష్ఠుడవు. అయితే ఏమి? ఇచ్ఛమూలంగా భ్రష్టుడవు అయ్యావు అని పై సూక్తికి భావము.

వ్యాపారులున్నారు చూడండి! వారి దృష్టి ఎప్పుడూ లాభంమీదనే ఉంటుంది. నష్టంమీద ఉండదు. అలాగే మనకుకూడ లాభదృష్టి ఉండాలి. నశించిపోయే వస్తువును స్వీకరిస్తే అదెలాగూ నశిస్తుంది. దానిని అనుభవించడంవలన పతనరూపంలో అది మనకు నష్టాన్ని కూడా కలిగిస్తుంది. ఆ వస్తువునే పరులసేవకు వినియోగిస్తే అది సార్థకం అవుతుంది. మనకూ శుభం చేకూరుతుంది. సాంసారిక పదార్థాలన్నీ మననుండి దూరం అయిపోవునట్టివే, ఎంతనిలువరించినా చివరకవి మనలను విడిపోవటం తథ్యము. కాబట్టి ఆ వస్తువులనే మనం పరులసేవకు వినియోగిస్తే అవి నశ్వరములే అయినా వాని ఉనికి చరితార్థం అవుతుంది. అవి అమరత్వాన్ని పొందుతాయి. "మర్త్యేనాప్నోతి మామృతమ్" అని చెపుతుంది భాగవతం (11/29/22). మరణధర్మంగలవాని సహాయంతో అమరుడనైన నన్ను (పరమాత్మను) పొందడం శక్యమవుతుంది అని ఆ వాక్యానికి భావం. సాంసారికవస్తువుల పరిత్యాగం బహిరంగంగా చేసినంతమాత్రాన చాలదు. వానిమీద మమకారాన్ని, ఆసక్తినికూడ వీడాలి. అప్పుడు వానిని పరులసేవకు వినియోగించాలి. త్రికరణశుద్ధిగా అట్టి భావన మనలో ఉన్ననాడు వస్తువులు

మనదగ్గరే పడి ఉండిపోయినా మనకు మేలే కలుగుతుంది. ఇందులకు భిన్నంగా మనము మన సర్వసంపదనూ ఇతరులకు దానం చేసినా మనలో నిష్కామభావం లేకపోతే మనకు శుభం చేకూరదు. మరణించేవాడున్నాడు చూడండి! వాడు తనవని అనుకొన్న వస్తువులనన్నిటినీ త్యాగం చేసిపోతున్నాడు. ఒక దారపుపోగునయినా వెంట కొనిపోవడం లేదు. అయినా వానికి శుభం చేకూరదు. కారణమేమంటే వానిలో త్యాగభావమూ లేదు. నిష్కామభావమూ లేదు. అయితే ఇప్పుడు భావమంటే ఏమిటి అన్నది ప్రశ్న. మనతో వియుక్తం అయిపోయే (మననుండి దూరం అయిపోయే) వస్తువును మనం మనదని అనుకోకపోవడమే ఇక్కడ భావమనే దానికి తాత్పర్యం.

ఈ సంసారం, (లోకం) అంతా పరమాత్మది. ఇచ్చటి వస్తువులన్నీ కూడ పరమాత్మవే. మనం మనవి అనుకునే వస్తువులుకూడ భగవానునివే. కాబట్టి యీ వస్తువులను పరులసేవకు ఎలా వినియోగింతునా? ఎలా వారికి హితము కలిగింతునా? అన్నప్రబలమైన భావన, తపన మనలో ఉండాలి. మనం మనవనుకునే వస్తువులను అనగా ధనసంపదలూ, పదవి, అధికారమూ మొదలైనవానిని అన్నిటినీ పరులసేవకు వినియోగించాలనే ఆరాటం ఉండాలి. లోభివాని మనములో ధనం ఇంకా ఎలా వస్తుంది? అనే తపన ఎలా ఉంటుందో అలాగే మనవి అనుకునే వస్తువులను పరులసేవకు ఎలా వినియోగించి చరితార్థం చేసుకొందామా అన్న ఆరాటం మనలో క్షణక్షణపరివర్ధమానం కావాలి. అలాంటి ప్రబలమైన భావన ఉన్నప్పటికి మనం మన వస్తువులను అన్నిటినీ సమగ్రంగా పరులసేవకు వినియోగించలేము. కారణమేమంటే మన దగ్గర ఆ వస్తువులకు కొరతనేది ఉండదు.

మంచిమంచి భావాలు మనం ధనవంతులనుండే నేర్చుకోవలసినవి ఉన్నాయి. ఎలాగంటే ధనం సంపాదించడం ఏమంత కష్టంకాదు. కాని, దానిని ఆవశ్యకతకలిగిన చోట ఖర్చుచేయడం, సద్వినియోగం చేయడం మాత్రమే కష్టమని వారు అంటూ ఉంటారు. సమయమనే ధనం అందరకూ ప్రాప్తించి యున్నదే. దానిని సద్వినియోగం చేయడంలోనే కష్టం గోచరిస్తుంది. సాధారణ ప్రజలలో ధనాన్ని ఉపార్జించడంలోనే శ్రద్ధ ఉంటుంది. కాని, దానిని సద్వినియోగపరచడంలో ఉండదు. అంతదాక

ఎందులకు? ఇతరుల విషయం అలా ఉంచండి. సత్సంగకార్యక్రమాలలో పాల్గొనే మన సోదరసోదరీమణులు ఎందరో ఉన్నారు కదా, వారికి కూడ అధికాధికంగా సత్సంగాలలో పాల్గొనడంలోనూ, ఇంకాఇంకా మంచిమాటలు వినడంలోనూ ఉన్నశ్రద్ధ విన్నవానిని ఆచరణలో పెట్టడంలోనూ, తదనుకూలంగా జీవితాన్ని మలచుకోవడంలోనూ ఉండదు. నిజానికి శ్రద్ధ అనేది విన్న విషయాలను ఆచరణలో పెట్టడంలోనే ఉండాలి. సత్సంగాలలో చెప్పిన విషయాలను సత్‌శాస్త్రములు చెప్పే విషయాలను అనుసరించి మన జీవితం సాగడంలేదే అన్న చింత మనలో ఉండాలి.

కొందరేమి అనుకుంటారు? అంటే మన దగ్గర పుష్కలంగా ధనం ఉన్నప్పుడుకదా మనం పుణ్యకార్యాలు చేయగలిగేది. కాబట్టి ధన సంగ్రహణం చేద్దామని అనుకుంటారు. అందుకు వారు ఉద్యమిస్తారు. కాని, నీతిశాస్త్రం ఏమంటుందంటే ధర్మాచరణంకోసం ధనసంగ్రహణంకోసం ప్రయత్నించడం మాట అటుంచి తత్సంబంధమైన ఇచ్ఛకూడ ఉండకూడదంటుంది. యజ్ఞదానాదిక్రియలకోసమైనా ధనాన్ని (విరాళాలుగా) కోరడం తప్పే అన్న మాటను మనం మరచిపోకూడదు. ఇంతకంటే మన దగ్గరున్న ధనాన్ని సద్వినియోగం చేయడమెలాగ? అనే తపన సర్వోత్కృష్టమైనది. దానివలన ఆత్మకల్యాణం చేకూరుతుంది. నీతిశాస్త్రం ఇలా చెపుతున్నది –

శ్లో. ధర్మార్థం యస్య విత్తేహా వరం తస్య నిరీహతా ।
ప్రక్షాలనాద్ధి పంకస్య దూరాదస్పర్శనం వరమ్ ॥

(పంచతంత్ర.)

"అడుసు త్రొక్కనేల? కాలు కడుగనేల?"

అడుసులో కాలువేసి కడుగుకోవడంకంటే ఆ అడుసును స్పృశించకుండా ఉండడమే మంచిది. కాని, అలాంటి మూర్ఖత్వపు పని చేసేవాడు తన కాళ్లు ముందు ప్రక్షాళితములుగాను పరిశుభ్రముగానూ ఉన్నవే అన్న సంగతిని ఆలోచించడు. ఇంటిలో కుళాయి ఉన్నది కదా అని బట్టలకు బురదపులుముకోవడమెలాంటి మూర్ఖత్వమో ధర్మాచరణంకోసం ధనసంపాదనకు ఉద్యమించడంకూడ అలాంటి మూర్ఖత్వమే అవుతుంది. అంతకంటె ఏ ఇచ్ఛయూ లేకుండ ఊరకుండడమే మంచిది. అట్టి మూర్ఖత్వానికి పాల్పడేవాడు తన బట్టలు ముందే ప్రక్షాళితములై ఉన్నవన్న

సంగతిని ఆలోచించడు. కాబట్టి శుభకార్యాచరణం కోసమైనా ధనాన్ని కూడబెట్టాలన్న తలంపు మంచిదికాదు. అయితే ధనము, విద్య, బలము, బుద్ధి మొదలైనవి నీకు ఏవి ప్రాప్తించి ఉన్నా మనం వానిని సద్వినియోగం మాత్రం తప్పక చేయాలి. ధనం వస్తుంది, పోతుంది. కాని, మనం శాశ్వతంగా ఉండే ఆత్మస్వరూపాలము. ఆ ధనం మనకు ఏ సుఖాన్నీ ఈయదు. ఎట్టి సుఖాన్ని ఈయని ఆ ధనాన్ని అపేక్షించడం బురదతో బట్టలను తాకించడం కాక మరేమి అవుతుంది? ఇక్కడ గమనించవలసిన అంశము ఒకటున్నది. బురద అంటే మట్టి. శరీరం కూడ మట్టియే. రెండూ సజాతీయాలైన వస్తువులే. రెండూ ప్రకృతివికారాత్మకాలే. కాని, మనము చిన్మయులం. ఇక ధనము? అది జడపదార్థం. నశ్వరం అయినది. దానివలన చిన్మయత్వం ప్రాప్తించదు. ఆ చిన్మయత్వాన్ని పొందాలంటే జడపదార్థంతో సంబంధాన్ని విడిచిపెట్టాలి. ధనంద్వార మనం భగవానుని కొనగలమని అనుకోవడం పెద్ద పొరపాటు. ధనంమాట అటుంచండి, భగవానుడు ఏమన్నాడో చూచితిరా?

"నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా"

(గీత. 11/53)

భగవానుడు యజ్ఞాచరణమువలన కానరాడు. వేదాధ్యయనంవలన కానరాడు. ఎంతో ధనాన్ని దానంచేసినా కానరాడు. ఎంతో తపస్సు చేసినా కానరాడు. వీనిలో దేనివలననూ తాను ప్రాప్తించనని భగవానుడే చెప్పుతున్నాడు. అయితే ఈ జడపదార్థాలతో సంబంధం తెగిపోయినప్పుడు మాత్రం సహజంగా చిన్మయతత్త్వమే మిగుల్తుంది.

దీనిమీద ఎవరైన ఇలా ప్రశ్నించవచ్చును ఆర్యా! యజ్ఞతపోదానాదులవలన భగవత్ప్రాప్తి కలుగదని మీరు అంటున్నారు. కాని, బగవానుడు గీతలో ఏమన్నాడో చూచితిరా?

శ్లో. యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥

(గీత. 9/27)

అనగా ఓ అర్జునా! నీవు ఏ పని చేయుదువో, ఏమి భుజింతువో,

ఏది హోమము చేయుదువో, ఏమి దానము చేయుదువో, ఏ తపము చేయుచున్నావో, అవన్నియూ నాకు అర్పించుము.

నీవు ఆచరించేదేదయినా నాకు అర్పణంచేస్తే శుభాశుభఫలైరేవం మోక్ష్యసే (గీత. 9/28) శుభము, అశుభమయిన ఫలాలనుండి విముక్తుడవవుతావు అని అంటున్నాడు (భగవానుడు). మరి దీనికి సమాధానం ఏమి చెపుతారు? దీనికి సమాధానమేమంటే ఇక్కడ సర్వము భగవదర్పణం చేయుము. అంటే యజ్ఞతపోదానాదులేమి చేసినా వానిని నీవి అని భావించుకోవద్దు అని భావం. దీనినిబట్టి తేలిన సారాంశమేమంటే భగవత్ప్రాప్తనేది వీనివలన గలుగదు. మమత్వాన్ని పరిత్యజిస్తేనే కలుగుతుంది.

"త్యాగాచ్ఛాంతి రనంతరమ్" (గీత. 12/12). త్యాగేనైకే అమృతత్వమానశుః (కైవల్యోపనిషత్తు–3) త్యాగంవలన భగవత్ప్రాప్తి కలుగుతుందని శ్రుతియు చెపుతుంది, స్మృతియు చెపుతుంది. త్యాగమంటే స్వార్థాన్ని, అభిమానాన్ని వీడి పరహితంకోసం పాటుపడడమన్నమాట.

విత్తనాలను నాటితే సస్యసమృద్ధి అవుతుంది. భక్షణచేస్తే మట్టవుతుంది. అలాగే భోగాలను (భోగ్యవస్తువులను) పరహితంకోసం వినియోగిస్తే పరమార్థపు సస్యం వృద్ధిచెందుతుంది. అంటే జీవుడు ఊర్ధ్వగతిని పొందుతాడన్నమాట. వానిని తానే అనుభవిస్తే పతనం ప్రాప్తిస్తుంది.

అయితే మనం ధనాదులను ఉపయోగించనే కూడదా? అన్న సందేహం కలుగుతుంది. దానికి సమాధానంగా మనం పవిత్రవస్తువులను ఉపయోగించ వచ్చునని చెప్పుకోవచ్చును. యజ్ఞశిష్టమంటే యజ్ఞంనుండి శేషించిన సామగ్రి పవిత్రమైనది అవుతుంది. ఏ పాపులు తమ శరీర పోషణకోసమే అన్నము వండుకొనుచున్నారో, వారలైతే పాపమునే తినుచున్నారు.

భుంజతే తే త్వఘం పాపా యే పచం త్యాత్మకారణాత్ । (గీత. 3/13)

శ్రుతికూడ– కేవలాఘో భవతి కేవలాదీ । అని చెపుతున్నది. అనగా కేవలము తినడంకోసం బ్రతికేవాడు పాపి అవుతాడని భావం.

మనవని అనుకొన్నవానిని పరహితంకోసం వినియోగించాలన్న భావన మనలో ఉన్నప్పుడు ఆ భావాన్ని ఆచరణలో పెట్టే ప్రయత్నము సంభవం అవుతుంది. స్వయంగా మనం మన జీవన నిర్వహణంకోసం అన్నవస్త్రాదులను ఉపయోగించుకో గలగడము సంభవమవుతుంది. ఒక్క అన్నవస్త్రాలు మాత్రమే కాదు, మంచిమంచి విషయాలేవైన మనకు తెలిసుంటే వానినికూడ పరహితంకోసం వినియోగించాలి. ఎల్లరకూ హితం చేకూర్చాలనే భావన ఎల్లరకూ మేలెలా చేకూరుతుంది? అనే భావనమాత్రం మనలో నిరంతరం పనిచేస్తుండాలి. ఈవిధమైన సర్వభూతహితాకాంక్ష భగవత్ప్రాప్తిని కలిగిస్తుంది. "హేతు రహిత జగ జుగ ఉపకారి" (తులసీదాసు) భగవానుడు, భగవద్భక్తుడు ఇరువురు మాత్రమే జగదుపకారకులు. అలాగే ఎవని హృదయంలోనైనా సర్వభూతహితభావన కలిగితే వానికి కల్యాణం(శుభం) చేకూరుతుందని అనడంలో సందేహం లేదు. కారణమేమనగా "మమ సాధర్మ్యమాగతాః" (గీత. 14/2). అని భగవానుడుకూడ అన్నాడు. అనగా పరహితరతులైనవారు నాతో సమానధర్మం కలవారవుతారని భావం.

తుచ్ఛవస్తువులతో సంపర్కం పెట్టుకోవడంవలన మనం తుచ్ఛులం అయిపోయాము. అట్లుకాక సర్వభూతహితుడైన పరమాత్మతోడ సంబంధం పెట్టుకుంటే మనం ఉన్నతస్థితిని అందుకొనేవారం. భగవానునకు అర్పింపబడిన భోగము పవిత్రము, పరిశుద్ధమవుతుంది. భగవానునకు నైవేద్యంగా అత్యంత సాధారణ వస్తువునర్పించినా దానికోసం గొప్పగొప్ప ధనవంతులు, ప్రతిష్ఠావంతులుసైతము చేయిచాపుతారు. ఏమి? ఎందుచేత? వారు ఆ అతిసాధారణవస్తువుకోసం లాలసులవుతున్నారంటారా? వారికి ఆ వస్తువులు అలభ్యములైన వంటారా? మరేమంటారు? అది యేదీ కాదు. భగవానునకు అర్పిస్తే వస్తువు పరమపవిత్రమవుతుంది. దాని మహత్త్వం పెరుగుతుంది. అలాగే ఒకడు తన సర్వస్వమూ భగవానునకు అర్పించివేశాడంటే తన సర్వస్వం మీద మమకారాన్ని విడిచిపెట్టాడంటే ఆ సర్వమూ పరమపవిత్రమవుతుంది. ఇదెంత సుగమము, సరళమైన విషయము? కేవలము భావాన్ని మార్చుకుంటే చాలు. ఎంతో అంతరం అనుభవంలోకి వస్తుంది. ధరల పెరుగుదల, తరుగుదలమీద లాభనష్టాలు

ఆధారపడుంటాయని, బజారు రేటును మార్చడము సాధ్యంకాదని వ్యాపారులు బాగా ఎరుగుదురు. కాని, మనోభావాన్ని మార్చుకోవడం మన చేతిలోని విషయం. కాబట్టి మనోభావాన్ని మార్చుకొని దానిని ఉన్నతస్థాయికి పెంచుకొని మనము ధనవంతులం అనగా కృతకృత్యులం కాగలము. అందులకే మనకు ఈ మానవశరీరం ప్రాప్తించింది.

ఇనపపెట్టె (తిజోరి) తాళం మనవైపుకి త్రిప్పితే మూసుకుపోతుంది. వ్యతిరేకదిశకు త్రిప్పితే తెరవబడుతుంది. అలాగే సర్వత్రా నిండియున్న పరమాత్మయొక్క సంపద మనకు దక్కాలనే భావంతో దానిపై మనం తాళంవేస్తున్నాము. అంటే దానిని నిలువరిస్తున్నాము. అందుకు భిన్నంగా భగవానుని సంపద అందరకూ దక్కాలన్న మనోభావం మనకు కలిగిననాడు ఆ తాళం తెరవబడుతుంది. నిజమైన మనసుతో పరమాత్మ దిశగా ప్రయాణించేవారి విషయంలో వారు చదువుసంధ్యలు నేర్వనివారైన శ్రుతిస్మృతులలోని తాత్త్విక విషయాలు వారి బుద్ధికి స్ఫురిస్తాయి అని పెద్దలు చెపుతుంటారు. అయితే అలా ఎందుకు జరుగుతుంది? అన్నది ప్రశ్న. ఆ విషయాలు మనకోసమే ఉద్దేశింపబడినవి కావున స్ఫురించడం జరుగుతుంది. అవి భగవానునకు ఉపయోగపడేవి కావు. వాని ఆవశ్యకత ఆస్వామికి లేదు. కారణమేమంటే జ్ఞానం వలన అజ్ఞానం అంతరిస్తుంది. భగవానుని దగ్గర అజ్ఞానానికి తావేలేదు. కాబట్టి శాస్త్రవిషయాల ఆవశ్యకత భగవానునకు లేదు. ఆ శాస్త్రీయవిషయాలన్నీ మనకోసం ఉద్దేశింపబడినవి. పదార్థాలను అపేక్షిస్తే ఆ జ్ఞానం ప్రాప్తించదు. పదార్థాలను అపేక్షించేవారికి ఆ జ్ఞానం ప్రసాదింపజేయబడదని భగవానుడు నిషేధమేదీ విధించలేదు. కాని, వానిని అపేక్షించేవాడు జ్ఞానాన్ని గ్రహించలేడు. పదార్థాలను, భోగాలను విడిచిపెట్టకుండా ఉన్న దశలోనే మనకు జ్ఞానం కలగాలనుకుంటే అది సాధ్యమూ కాదు. సంభవమూ కాదు.

రెండు చీమల దృష్టాంతాన్ని సాధువులు చెప్పారు. అదెలాగంటే, రెండు చీమలున్నాయి. ఒకటి ఉప్పుగడ్డమీద ఉండేది. రెండవది చక్కెరగడ్డమీద ఉండేది. ఆ రెండింటికీ నడుమ మైత్రీబంధమేర్పడినది. ఒకనాడు ఉప్పుగడ్డ చీమ చక్కెరగడ్డ చీమను తన గడ్డమీదకు తీసుకొనిపోయింది. తన ఉప్పుగడ్డను తినమని చెప్పింది. అప్పుడు రెండవ చీమ మిత్రమా! ఏమి తినను? ఇది కూడ ఒక తిండియేనా? ఇది యేమైన

మధురంగా ఉండే మిఠాయియా ఏమి? ఇందులో తీపి యేది? అన్నది. తీపంటే ఏమిటి? ఇంతకంటె తీయనైన పదార్థం వేరొకటి ఎంద్రైన ఉందా? అంది మొదటి చీమ. ఈ పదార్థంలో తీపన్నది లేనేలేదు. తీపి పదార్థంయొక్క జాతియేవేరు అంటూ తియ్యదనాన్ని అనుభవపూర్వకంగా తెలియజేయడం కోసం రెండవ చీమ మొదటి చీమను తన చక్కెరగడ్డమీదకు తోడ్కొనిపోయినది. ఆకలేస్తే ఇబ్బంది పడవలసి వస్తుందేమో అన్న ముందుచూపుతో వెళుతున్నప్పుడు మొదటి చీమ ఒకింత ఉప్పుగల్లును నోటపెట్టుకొని మరీవెళ్ళింది. చక్కెరగడ్డకుచేరి ఉప్పుగడ్డనోట ఉండగా చక్కెరరుచి చూచినా దానికి ఉప్పుగానే తోచింది. తియ్యగా ఉంది కదా! తీపంటేమిటో ఇప్పుడు తెలిసిందా? అని ప్రశ్నించినది రెండవ చీమ. నీమాట నిజమే అని నేనెలా అనగలను? నీవు అన్యథా భావించకుండా ఉంటే నిజం చెపుతున్నాను. విను నా గడ్డరుచికీ, ఈ గడ్డరుచికి నాకు భేదమేమీ కానరాలేదు అంది మొదటి చీమ. అప్పుడు రెండవ చీమ విషయం ఏమై ఉంటుంది? దీనికి చక్కెర ఉప్పుగా ఎలాతోస్తున్నది? అని ఆలోచించి చక్కెరపలుకును నోటిలో పెట్టుకొని రుచి చూచింది. అది తియ్యగానే తోచింది. అప్పుడు క్షణమేమో ఆలోచించి మిత్రమా! ఇక్కడకు వస్తూవస్తూ ఒకింత నీఉప్పుగడ్డపలుకు (ముక్క)ను నోట పెట్టుకొని కాని రాలేదు కదా? అని రెండవ చీమ మొదటిదానిని ప్రశ్నించినది. ఆకలి వేయకుండా ఉంటుందని తలచి ఒకింత ఉప్పుగల్లును నోటిలో ఉంచుకొని వచ్చానని మొదటి చీమ బదులు చెప్పింది. అలాగా? అలా అయితే దానిని బహిర్గతం చేసెయ్యి అన్నది రెండవ చీమ. అట్లే చేసింది మొదటి చీమ. ఇప్పుడు ఈ చక్కెరపలుకును తిని చూడుమా! అన్నది రెండవ చీమ. అప్పుడు మొదటి చీమ రుచి చూచినది. ఇక మారు మాటాడక తినివేయ మొదలుపెట్టింది. ఎలా ఉంది? అని అడిగింది రెండవ చీమ. మాటాడకు నన్ను తిననీ, అని సైగలతో సమాధానం చెప్పింది మొదటి చీమ.

ఈ విధముగానే సత్సంగంలో పాల్గొనే సోదరులు, సోదరీమణులుకూడ సత్సంగంలోని ప్రసంగాలను ఆలకిస్తున్నారు. కాని ధనము, పేరుప్రతిష్ఠలు, గౌరవాదరాలు మొదలైనవానిపై తమ పట్టును విడిచిపెట్టడం లేదు. వానిని పట్టుకొనియుండియే ఆలకిస్తున్నారు. అప్పుడు

నిజముగా సాధనచేస; అందలి మాధుర్యాన్ని అనుభవపూర్వకంగా తెలుసుకొన్నవారు వా( నెలా ఉంది? అని అడిగితే వారు బాగుంది. బాగుంది అని బదులు చెపుతున్నారు. కాని, అందలి నిజమైనరుచిని వారు గ్రహించడం లేదు. కా(రణమేమంటే వారి నోట ఉప్పుగల్లు పడియుంది. అంటే ధనాదికాన్ని (సే)కరించడంలోను, భోగాలను, గౌరవాదరాలను అభిలషించడంలోను వారింకా అభిరుచిని వీడలేదన్నమాట. నిజం చెప్పాలంటే వారు ఈ నశ్వరవస్తువులమీది వ్యామోహాన్ని వీడి పరమాత్మ ప్రాప్తినే తమ పరమలక్ష్యంగావించుకోవాలి.

ధనము, సంపద మొదలైన వస్తువులు మనవెంట వచ్చేవికావు. వినియోగించుకోవలసినవే. ఒక మార్గము లేక రోడ్డు ఉందనుకోండి! దానికి అవరోధాలు కల్పించి నిరోధిస్తే ప్రయోజనమేముంటుంది. అది కేవలమూ జనుల రాకపోకలకు ఉద్దేశింపబడినది. అందులకే ఉపయోగపడాలి. అలాగే ఈ సాంసారికపదార్థాలుకూడ వస్తూపోతూ ఉండేవి. వీనిని మనము ఉపయోగించుకోవాలి. పరులనూ ఉపయోగించుకోనీయాలి. కాని, యిందులకు భిన్నంగా కేవలము సామగ్రిని సమీకరించడము, భోగాలను అనుభవించడము మాత్రమే లక్ష్యంగా పెట్టుకుంటే మనలో దైవీసంపదకు బదులు ఆసురీ సంపద పెంపొందడం మొదలవుతుంది. ఆసురీసంపద కలవారికి "కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః" (గీత. 16/11) బ్రతికియున్నంతకాలమూ భోగాలననుభవిస్తూ ఉండడమే ప్రముఖలక్ష్యంగా ఉంటుంది. కాని, బుద్ధిమంతులు ఏమంటారు? నాయనా! నీవే ఆలోచించు! ఈ భోగపదార్థాలతోను, భోగాలతోను సంబంధం మనకెన్నాళ్లు ఉంటుంది? అంటారు. మనం మంచి వెలగల వస్త్రం ధరిస్తాము. దానిలో ఒకింత ముడతపడితేకూడ భరించలేక విలవిలలాడతాం. మనం ఎంతగా భోగపరతంత్రులమై ఉన్నాము? అంటే కట్టుకున్నబట్ట ఒకింత నలిగితే అల్పమైన ఆ విషయాన్నికూడ భరించలేకున్నాము. విలువైన వస్త్రాలను ధరించరాదని అనడమూ మా ఉద్దేశ్యం కాదు. సమయానుసారముగా మంచిమంచి బట్టలు కట్టుకోవడంలో తప్పులేదు. కాని, అలాంటి వస్త్రములను ధరించడమే మన పరమలక్ష్యం మాత్రం కాకూడదు. మనమెంత జాగరూకత వహించినా బట్టలు నలగకనూ పోవు. మలినములుకాకనూ పోవు. భోగాలననుభవించే పరిజ్ఞానం మనలోనే

కాదు, పశుపక్ష్యాదులలోకూడ ఉంది. అయితే భగవానుడు విశేషంగా మానవులకు వివేకశక్తిని ఇచ్చాడు. సారమేదో అసారమేదో గుర్తింపగల సామర్థ్యాన్ని ఇచ్చాడు. ఆ శక్తిని మనం మన సుఖభోగాలకోసము, పరులకు హాని కలిగించడం కోసము వెచ్చించరాదు. ఋషులు, మునులు తమ తెలివినంతనూ జగత్కల్యాణంకోసం వినియోగించారు. ఆ కారణంగా వారు మహానుభావులయ్యారు.

యుద్ధములో మాయామయమైన విజ్ఞానాన్ని ప్రయోగించడము, మోసాలు, వంచనలనేవి రాక్షసులలోనే కానవస్తాయి. వీనిని మహర్షులెన్నడూ ప్రయోగించలేదు. ధనాదులను కూడబెట్టడమనే పని యక్షులు, రాక్షసులు మాత్రమే చేసేవారు. ఈ మాటలను బట్టి ఎవరూ ధనసంగ్రహణం చేయరాదని, ధనం కలిగుండరాదని భావించుకోరాదు. వానిని సద్వినియోగం చేసుకోవాలనే భావాన్నే గ్రహించుకోవాలి. ధనము, సంపద, విద్య, బుద్ధి, బలము మొదలైనవానిలో మహత్త్వమేదీలేదు. వానిని యుక్తమైనవిధముగా ఉపయోగించడంలోనే మహత్త్వముంది. ఈ విషయంలో చెప్పబడిన నీతిశ్లోకముంది. అదేదంటే:

శ్లో. విద్యా వివాదాయ ధనం మదాయ
శక్తిః పరేషాం పరిపీడనాయ
ఖలస్య సాధోర్విపరీతమేతత్
జ్ఞానాయ దానాయ చ రక్షణాయ

దుష్టుని దగ్గర విద్య ఉంటే వివాదాలు చేయడానికీ, ధనముంటే గర్వంతో కన్నులు మూసుకుపోయి చరించడానికి, శక్తుంటే పరులను పీడించడానికి ఉపయోగపడుతుంది. ఇందులకు భిన్నంగా సజ్జనుని దగ్గర విద్య ఉంటే జ్ఞానం పెంపొందడానికి, ధనముంటే దానాది పుణ్యకార్యాలు ఆచరించడానికి, శక్తుంటే పరులకు రక్షణ కల్పించడానికి ఉపయోగపడుతుంది. తద్వారా జీవుడు పరమకల్యాణాన్ని పొందుతాడు.

కాబట్టి మన దగ్గర శక్తి, సమయము, సామగ్రి, తెలివి మొదలైనవి అధికంగా ఉన్నా, అల్పంగా ఉన్నా ఎంతగా ఉన్నా వానివలన ప్రయోజనమేమీలేదు. వానిని పరహితంకోసం వినియోగించడం జరిగినప్పుడే వాని అస్తిత్వం చరితార్థమవుతుంది. ప్రజలెల్లరూ

భగవానునివారు. కావున వారికి సేవచేస్తే భగవానుని శక్తి మనకు ప్రాప్తిస్తుంది కారణమేమంటే,

శ్లో. యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్ ।
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥
(గీత. 4/11)

అని భగవానుడు ప్రతిజ్ఞచేశాడు. పార్థా! ఏ భక్తులు ఏవిధముగా నన్ను భజింతురో, నేనుకూడ వారలను అదే విధముగా (మార్గములలో) భజించుచున్నాను (అనుగ్రహించుచున్నాను) ఏలననగా, జనులందరు అన్నివిధములా నా మార్గమునే అనుసరించుచున్నారు. అంతేకాదు. భగవానుడు లభిస్తాడుకూడ. సత్సంగంలో విన్న విషయాలను, ఉపయోగించుకోవడమెలాగని ఆలోచించుకుంటూ మనమందుకోసం ప్రయత్నం చేయాలి. సత్సంగంలోని విషయాలను వినవద్దని చెపుతున్నామనుకోవద్దు. తప్పకుండా వినాలి. వింటుండడం వలన విన్నవిషయాలను ఆచరణలో పెట్టాలన్న ప్రేరణ లభిస్తుంది. కాబట్టి ప్రతివ్యక్తి తాను విన్నవిషయాలను ఆచరణలో పెట్టడానికిమాత్రం విశేషముగా కృషిచేయాలి.

సారాంశంగా చెప్పేవిషయమేమంటే పరమాత్మ యొక్క అంశమయిన కారణంగా జీవునకు తానున్నస్థాయితో సంతుష్టి కలుగదు. వాడు ఉన్నతిని పొందాలని కాంక్షిస్తాడు. భగవత్ప్రాప్తి కలిగే వరకూ ఆ జీవునకు నిండార సంతుష్టి యన్నది కలుగదు. పైనచెప్పిన విధముగా నడుము కట్టుకొని సాధనచేస్తే మానవుడు ఉన్నతిని పొందుతాడు. పరమాత్మను పొందగలుగుతాడు. ఈ పని యీ మానవ శరీరమున్నప్పుడే సాధ్యమవుతుంది. కారణమేమంటే పరమాత్మ తనను పొందడంకోసమే జీవునకు ఈ మానవశరీరాన్ని ప్రసాదించాడు. దానితోపాటు అందులకు ఆవశ్యకమైన సాధనసామగ్రినికూడ సమకూర్చాడు. కాబట్టి మనం పరమాత్మప్రాప్తికోసం ఎంతయినా కృషి చేయవలసి ఉంది.

~~~~oOo~~~~


~~~~